# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

OFFICIAL REPORT

---

Sixth day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Saturday, the 2nd November*, 1957

The House met at Half Past Eight of the Clock

[MR. SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(*See Part I*)

## Adjournment Motion Re: discussion of Pataskar's Report.

శ్రీ యన్. పి. చంగల్రాయనాయుడు (పేపంజేరి) :—అధ్యక్షా, నేను పటాస్కార్ రిపోర్టు గురించి ఒక ఎడ్జర్న్‌మెంట్ మోషన్ ఇచ్చాను. అధ్యక్షులవారు దానిని allow చేయాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—ఎడ్జర్న్‌మెంట్ మోషన్ తీసివేశాను. ఎడ్‌జర్న్‌మెంట్ మోషన్‌లేదు బిజినెస్ అడ్వయిజరీ కమిటీలో చర్చించి, పటాస్కార్ రిపోర్టు డిస్కషన్‌కు ఒక గంట ఇద్దామని అనుకొన్నాను. ఆ విషయం బిజినెస్ అడ్వయిజరీ కమిటీలో పెట్టాను. "ఇది ఇప్పుడు ఎందుకు డిస్కషన్" అని బిజినెస్ అడ్వయిజరీ కమిటీలో అన్నారు. బిజినెస్ అడ్వయిజరీ కమిటీవారు తిరిగి ఒక గంట ఇస్తామంటే నాకు అభ్యంతరంలేదు.

ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి) :—అధ్యక్షా, యీ శాసనసభ అభిప్రాయాలు తీసుకోకుండా, పార్లమెంటులో ఇందుకు సంబంధించిన బిల్లు pass కావటానికి అవకాశంలేదు. ఆ బిల్లు మన శాసనసభకు వచ్చినప్పుడు ఒక గంటే కాదు, ఒకటి రెండు రోజులు మన శాసన సభ్యులందరు చర్చించాలి. మన శాసనసభ్యులందరూ తమ అభిప్రాయం చెప్పాలి. వారి అభిప్రాయాలు

చెప్పిన తర్వాతనే, పార్లమెంటు ఏమైనా చర్యలు పుచ్చుకోటానికి వీలుంటుంది. ఈనాడు పటాస్కర్ రిపోర్టు అన్నదీ, గవర్నమెంటు రిపోర్టుకాదు. అది మాకు హోమ్ డిపార్టుమెంటు దగ్గరనుంచి రాలేదు. హోమ్ డిపార్టుమెంటువారి ఉత్తర్వు ప్రకారం పటాస్కర్ ఇక్కడకు రాలేదు. ఏదో స్నేహితులముగా, ఇద్దరము వారిని పిలిస్తే వారు ఇక్కడకు వచ్చారు. ఒక రిపోర్టు ఇచ్చారు. అది సభ్యులందరికీ అందజేశాము. అది మన దగ్గరకు, తర్వాత ఢిల్లీ నుంచి వస్తుంది. It will be referred to us at a later stage అప్పుడు మనం సుదీర్ఘంగా చర్చించుకోవచ్చును. కాబట్టి దానిని రెండు పర్యాయాలు చర్చించేదానికన్నా, అప్పుడే దీర్ఘంగా చర్చిస్తే మంచిదని అనుకొన్నాము. అంతేతప్ప మరొక అభిప్రాయంకాదు.

శ్రీ పి. గోపాలురెడ్డి (తిరుత్తని—జనరల్) :—అధ్యక్షా, పటాస్కర్ రిపోర్టు పేపర్లో పబ్లిష్ అయితేగాని, మాకెవ్వరికీ అందలేదండీ. పటాస్కర్ రిపోర్టు ఎడ్వయిజరీ అని మన మంత్రిగారు చెప్పినారు. మద్రాసు శాసన సభలో నిన్న సుబ్రహ్మణ్యంగారు "అందులో అణుమాత్రమైనా ఇటు అటు మార్చటానికి వీలులేదని" అన్నారు. ఇటువంటి పరిస్థితిలో, స్థానికంగా ఎఫెక్టు అయ్యేవారికి, వారి యొక్క కష్టములను, దుఃఖములను చెప్పుకొనే అవకాశం ఇవ్వకపోతే ఎట్లా? ఆ విధంగా వారికి అవకాశం ఇవ్వకపోతే, పటాస్కర్ రిపోర్టులో ఏమైనా సవరింపులు చేసేదానికి కూడా వీలులేకుండా పోతుందేమోనని మా అనుమానము. మనం ఇప్పుడు ముసాయిదా బిల్లును తయారుచేసి, దానిని సవరించలేము. కాని అక్కడ స్థానికంగా ఉన్న ప్రజల ఇబ్బందులను తొలగించుటకు సలహాలు ఇస్తే బాగుంటుందన్న కోరికతో, ఆ రిపోర్టు మీద డిస్కషన్ చేయాలని కోరుచున్నాను.

శ్రీ యన్. సంజీవరెడ్డి :—స్పీకర్‌గారు ఉత్తరువు ఇస్తే, పటాస్కర్ రిపోర్టును టేబుల్ మీద పెట్టటానికి నాకు అభ్యంతరంలేదు. ఇది నాన్ అఫీషియల్ కాబట్టి టేబుల్‌మీద ఎట్లా పెట్టటమా, అని ఆలోచిస్తున్నాను తప్ప వేరు కాదు. ఇప్పుడు అది ఎవరికి కావలసినా ఇస్తాము. It is not a secret document. స్పీకర్‌గారు ఉత్తరువు ఇస్తే, దానిని Table మీద పెట్టటానికి నాకు అభ్యంతరం లేదు. లేదా గోపాలురెడ్డిగారికి ఒక కాపి ఇవ్వమన్నా ఇస్తాను. గోపాలురెడ్డిగారు తిరుత్తనివారు కాబట్టి, వారు కొంత agitated గా ఉన్నారు. వారు ఏమైనా సలహాలు ఇవ్వదలచుకొంటే, శాసనసభ ద్వారానే ఉపన్యాసాల ద్వారానే ఇవ్వాలని లేదు. ఈ రిపోర్టు చర్చకొరకు ఒకగంటో రెండు గంటలో ఇస్తే అభ్యంతరంలేదు. కాని official గా నోటీసు తీసుకోటానికి వీలుంటుందా అనేది నా అనుమానము.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య (సత్తెనపల్లి) :—అధ్యక్షా, పటాస్కర్ రిపోర్టు కాంగ్రెసు ఆర్గనైజేషనల్ రిపోర్టు అని ముఖ్యమంత్రిగారు చెప్పారు.

శ్రీ యన్. సంజీవరెడ్డి :—ఎప్పుడైనా నేను ఆ మాట అన్నానా?

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య :—మరి, ప్రయివేటు రిపోర్టు అని అంటున్నారు. అదేమిటో అర్థం కావటంలేదు.

మిస్టర్ స్పీకర్ :—ప్రయివేటు అంటే "ఆఫీషియల్‌గా ఆ రిపోర్టు రాలేదని"—

రెవిన్యూ మంత్రి (శ్రీ కె. వెంకటరావు) :—"ప్రయివేటు" అని అంటే "కాంగ్రెసు" అనా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—అయితే చాలా సంతోషము. పటాస్కర్ రిపోర్టు ఇద్దరు ముఖ్యమంత్రులు చేసుకొన్నటువంటి ప్రయివేటు రిపోర్టు అని తేలిపోతోంది. ఎప్పుడో బిల్లు వచ్చినప్పుడు చర్చిద్దామని, ఇవాళ చర్చ జరపకపోతే చాలా సమస్యలు ఏర్పడతాయి. చివరకు మన గవర్నమెంటు map కూడా ఇవ్వలేని స్థితిలో ఉన్నది. కాబట్టి యీలోగా మనం ఏదైనా మార్పులు చేసుకోవటానికి వీలుంటుందేమో—

*Sri N. Sanjeeva Reddi :* Mr. Speaker, Sir, let me protest against this insinuation. గౌ. సభ్యులు గోపాలకృష్ణయ్య గారు ఎప్పుడు మాట్లాడినా insinuation లేకుండా మాట్లాడరు. Map కూడా ఇవ్వలేని పరిస్థితిలో ప్రభుత్వం ఉన్నదట! వారికేమీ తెలియకపోయినా, ఏదో ఒకటి మాట్లాడటము సరైంది కాదు. ఆ రిపోర్టు ఇంకా చర్చకు రాలేదు. మేము ఏమిచేసినామో వారికి తెలియదు. సభ్యులు మాట్లాడేటప్పుడు insinuation లేకుండా మాట్లాడటం నేర్చుకొంటే, చాలా సంతోషిస్తాను అని చెబుతున్నాను.

*Sri B. Sreerama Murthy (Vizianagaram)*: On a point of order, Sir. From the news items published in the news papers, I come to gather..........

*Mr. Speaker:* Which paper? I suppose it is not 'Nava Sakti' ?

(Laughter)

*Sri B. Sreerama Murthy:* I mean daily papers, Sir. I have gathered that Government have been giving copies of the Pataskar's Report to the Andhra Provincial Congress Committee. In this matter I feel that a grave injustice has been done in as much as discrimination has been made by the Government between political parties. Therefore, I feel the using of the term 'private' is quite justified and the Congress Government has come to be identified itself with the party. Therefore, it is not a question of democracy but dictatorship. Hence, I request for an immediate discussion on the matter in the House and time may be allowed for this, Sir.

మిస్టర్ స్పీకర్ :—వారికి కాపీలు గవర్నమెంటువారే ఇచ్చారో, లేక వేరు విధంగానే వచ్చాయో, అది వేరే సంగతి.

*Sri K. Venkata Rao:* It was released from Delhi, Sir. We never gave to any one.

మిస్టర్ స్పీకర్ :—ఒక పార్టీ సభ్యులకు ఇచ్చినప్పుడు ఇతర పార్టీలకు కూడా ఇవ్వండి. అసలు ఎవ్వరికీ ఇవ్వకపోతే ఏమీలేదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి :—ఏ పార్టీవారు ఇంతవరకు "నాకు కాపీ కావాలి" అని అడిగిన వారు లేరు. ఏ పార్టీవారైనా "నాకు కాపీ ఇవ్వండి" అని అడిగి ఉంటే, నా పర్సనల్ కెపాసిటీలో, నాకు ఎట్లాగైతే పటాస్కర్‌గారు పర్సనల్ కెపాసిటీలో పంపినారో అదే రకంగా ఎవరికైనా సరే ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నాను. ఆ రిపోర్టు టేబుల్ మీద పెట్టటానికి సిద్ధంగా ఉన్నానని చెబుతున్నాను. అంతలోనే, డిక్టేటర్‌షిప్ అని ఏవేవో వారికి యిష్టమైన పదాలన్నీ వాడతారు. మమ్మల్ని అఫెండ్ కావద్దు అని చెబుతారు. ఎట్లా ? మేమూ మనుష్యులమే. మేము దేవతలమా ? వారు ఆ పదాలు వాడితే, మేమూ వాడవలసివస్తుంది. వాడితే మమ్మల్ని......

మిస్టర్ స్పీకర్ :—మీరు వాడనందుకు మరీ మంచిది. అందుకు కంగ్రాచ్యులేషన్సు అందజేస్తున్నాను. ఎక్కువ మర్యాదగా ఉండటం మంచిదికదా—మొత్తం మీద, ఫలితం ఏమిటంటే, పటాస్కర్ రిపోర్టు టేబుల్ మీద పెడతారు.

శ్రీ పి. సుందరయ్య :—అధ్యక్షా, ఇంతకు ముందు మీరు మాట్లాడుతూ రాష్ట్ర కాంగ్రెసు వి ఎటీ, రాష్ట్ర ప్రభుత్వము రెండూ ఒకటేనని అన్నారు. అది మన ముఖ్యమంత్రిగారు అంగీకరిస్తున్నారేమో కాని, నేను మాత్రము అంగీకరించడములేదు.

మిస్టర్ స్పీకర్ :—ఎందువల్ల చెప్పాను అంటే, ఇంగ్లండులో కూడ అక్కడ ఉన్న లేబరు పార్టీకి, దానికి వెనుక ఒక organisation అనేది ఉన్నది ఇక్కడ మీ కమ్యూనిస్టు పార్టీకి గూడ వెనుక ఒక organization అంటూ ఉన్నట్లు. ఏ పార్టీకైనా వెనుక ఒక Organization, Party set up అంటూ ఉంటున్నది. గనుక దానికి ఎవరు ఏమి చేస్తారు ? That is how it is set up and we cannot help it అదేవిధముగ కాంగ్రెసు పార్టీకి వెనుక ఒక organization అంటూ ఉండడమువల్లనే, వారికి మెజారిటీ వచ్చింది, ప్రభుత్వము ఏర్పాటుచేయడము అయింది. ఇప్పుడు ఆ సంబంధము మనము తెగగొట్టటానికి వీలులేదు. అట్లాగే మీకు మీ organization ఉన్నట్లు వారికి గూడ ఉన్నది. అందులో చిక్కు ఏమిలేదు. ఇప్పుడు ఉన్నదల్లా as Ministry అన్ని పార్టీలకు సమానంగా రిపోర్టులు పంపాలి. కాని వారు వారి పార్టీలో ఏమిచేసుకున్నారో మనకు దానితో సంబంధములేదు.

శ్రీ పి. సుందరయ్య :—అధ్యక్షా, reports విషయము అటు ఉంచండి. ఇప్పుడు నేను మనవి చేసేది ఒక పార్టీకి సంబంధించిన కమిటీని, ప్రభుత్వాన్ని ఏకముచేసే చెప్పేది మన రాజ్యాంగ చట్టములో లేదు. మన భారతదేశపు రాజ్యాంగ చట్టము ప్రకారము రాష్ట్రములో ఏ పార్టీ మెజారిటీలో ఉంటే ఆ పార్టీ ప్రభుత్వములోనికి వస్తుంది. కాని ప్రభుత్వం ఏర్పడిన తరువాత అది ఆ ఒక్కపార్టీ పనులే చేస్తుందనే విధముగ అయితే, అది మన రాజ్యాంగ చట్టమునకు

పూర్తిగ వ్యతిరేకము. అందువల్ల యీ విషయములో అధ్యక్షులవారు ఒక రూలింగు యిస్తే మంచిది.

మిస్టర్ స్పీకర్ :—దీనిలో రూలింగు ఇవ్వవలసిన అవసరం ఏమి ఉన్నది.

శ్రీ పి. సుందరయ్య :—రూలింగు యివ్వకపోతే ఆ విషయమును గురించి చాలా అపోహలు ఏర్పడుతాయని అనుకుంటాను. ఎందువల్లనంటే, రాష్ట్ర కాంగ్రెసు కమిటీయే రాష్ట్రప్రభుత్వము అయితే దానికి అర్థములు చాలా ఉంటాయి. దాని కార్యక్రమములు అన్నీ వేరే రకముగ ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ప్రభుత్వములో మంత్రులుగ అందరూ కాంగ్రెసుపార్టీవారే ఉండవచ్చు అలాంటప్పుడు ప్రభుత్వములో ఉన్న ఉద్యోగస్థులు గాని, పోలీసులుగాని, ప్రభుత్వములోని కాంగ్రెసు పార్టీ అని చెప్పి కాంగ్రెసువారు ఏది చేస్తే అది దేశము కొరకే చేస్తున్నాము అనే రీతిగాను, దేశము, కాంగ్రెసు అంతా ఒకటేననే రీతిగాను చెప్పడము మాత్రము మేము అంగీకరించడములేదు. ఏమైనప్పటికిని యిప్పుడు ఆ విషయమును గురించి లోతుకు పోవలసివస్తే ప్రస్తుతము టైము చాలదు. ఈనాడు పటాస్కార్ రిపోర్టును గురించి చర్చించాలి. దానికి టైము ఒక దినము అయినా కావలసి ఉంటుంది. అందులో చాలా విషయములను గురించి చర్చించవలసియున్నది. అంతేగాని, ఒక గంట అని అంటే, టైము బొత్తిగా చాలదు. దానివల్ల ప్రయోజనములేదు.

శ్రీ యన్. సంజీవరెడ్డి :—ఈరోజున పటాస్కార్ రిపోర్టును గురించి చర్చించే బదులు, దానికి మరల మనము చర్చించవలసిన సమయము వున్నది గనుక, రెండుసార్లు చర్చించేబదులు అది చర్చించవలసినప్పుడు పూర్తిగానే ఎన్ని గంటలు చర్చించాలని అనుకుంటే అన్ని గంటలు అధ్యక్షులవారు పిలిచినప్పుడు చర్చించుకోవచ్చును.

మిస్టర్ స్పీకర్:—Even with regard to the constitutional question also, సర్వీసెస్ విషయము చూస్తే పర్మనెంటు సర్వీసెస్‌లో ఉన్నవారు ఏ పార్టీకి గూడ చెందిన వారు కారు. Legislature లో మాత్రము వేరేవేరే పార్టీలవారు ఉన్నారు. వాటిని మనము ఏమీ తీసివేయలేము. అయితే మంత్రులుగా ఉండేవారు మాత్రము నిష్పక్షపాతముగా ఉండాలి. మెంబర్లు మాత్రము ప్రజల తరఫున వచ్చినవారు గనుక ప్రజల యొక్క హక్కులు, మేలు చూచుకోవలసిందేగాని, కేవలము వారు వారి పార్టీ మీదనే ఆధారపడి పెనుగులాడడము మంచిదికాదు. అలాగుచేయడము తప్పే. సబబు కాదు. ప్రత్యేకంగా ఒక పార్టీ అంటే అది వేరే సంగతి. వేరు వేరు పార్టీలుగా ఉంటున్నప్పుడు మీ organization మీకు ఉంటుంది. వారిది వారికి ఉంటుంది. There are All India Parties and we cannot help it. That is quite a different matter. అందువల్ల నేను ప్రత్యేకంగా ప్రభుత్వము యొక్క structure ను కల్పించనులేను, తీసివేయనూలేను. Here I am only expressing some of my views. In some of them I may be wrong. But I have no objection to be corrected. So that is my present view. కాబట్టి ఏ పార్టీ ఆర్గనైజేషను ఆ పార్టీ వెనుక వుంటుంది. ఆ organization తో మనకు సంబంధము లేదు. వాటిని మనము ఏమీచేయలేము. ఇప్పుడు రాష్ట్రములో మెజారిటీ పార్టీ వారు ప్రభుత్వములో ఉన్నారు. అది పార్టీ గవర్నమెంటు గనుక, ఎవరూ ఏమీ చేయలేరు.

శ్రీ కె. వెంకటరావు :—ఇప్పుడు నేను మనవి చేయదలచుకున్న విషయము ఏమిటంటే, సుందరయ్యగారు చాలా తెలిపినవారే. అందుచేత భారత రాజ్యాంగ చట్టము క్రింద వున్న విషయములు వారు చెప్పారేగాని, యితర దేశపు రాజ్యాంగ చట్టములను గురించి వారు చెప్పలేదు. అదే అందులో వున్న distinction.

శ్రీ పి. సుందరయ్య :—ఒక్క దినము దానికి ప్రత్యేకంగా కేటాయిస్తామని అంటే, దానిని గురించి కూడ మనము చర్చించవచ్చు. అందుకు నాకేమాత్రమూ అభ్యంతరము లేదు.

శ్రీ కె. వెంకటరావు :—అధ్యక్షా, భారత రాజ్యాంగ చట్టములో కాంగ్రెసుపార్టీ దేశములో ఉన్న సర్వమునకు తానే అనే position తీసుకోలేదు. అదే దాని యొక్క గొప్పతనము. ఆ గొప్పతనమే తమరు కూడ ఉద్ఘాటించారు. అంతే కాని, అనవసరముగ బాధపడడము ఎందుకు ?

మిస్టర్ స్పీకర్:—ఇదేమిటో నాకు అర్థము కావటములేదు. But whatever it is, let us go tothe next subject. రాజగోపాలనాయుడుగారు పి. గోపాలురెడ్డిగారు, ఇద్దరు కూడ ఒకే ప్రదేశము నుంచి వచ్చారు గనుక, వాస్తవముగ వారికి యీ వటాన్కూర్ రిపోర్టు విషయములో కొంచము కష్టముగ ఉండవచ్చు. ముఖ్యమంత్రిగారు రిపోర్టును యిక్కడ టేబుల్ మీద పెట్టుతామని అన్నారు. దానిని గురించి ఎంతసేపు, ఎప్పుడు చర్చించడము అనేది రేపు Business Advisory Committee లో తేల్చుతారు.

శ్రీ పి. గోపాలరెడ్డి:— Business Advisory Committee మీటింగు ఎప్పుడు ఏర్పాటు చేస్తారు ?

మిస్టర్ స్పీకర్ :—రేపో ఎప్పుడో ఏర్పాటుచేసి decide చేస్తారు.

## Motion under Rule 74 re: abolition of auction of Kanchas in taken over Estate villages of Nellore district.

మిస్టర్ స్పీకర్ :—తరువాత 74వ రూలు క్రింద taken over estates లో కంచెల auction system abolition గురించి Revenue Minister గారి దృష్టి కి తేవటానికి ఒక notice యిచ్చారు.

ఇందులో చర్చ ఏమీలేదు. 74వ రూలు యొక్క ఉద్దేశ్యము అంతే. I now call upon the Revenue Minister to say something about this ?

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు : (నందిగామ) :—అందులో ఏమి వ్రాశారో చదివితే, దాని మీద మంత్రిగారి సమాధానము మాకు అర్థమవుతుంది.

మిస్టర్ స్పీకర్ :—సరే చదువుతాను వినండి.

"I give notice of the following Motion:

Under Rule 74 I call the attention of the hon. Minister for Land Revenue to the following urgent matter of public importance; *viz.*, 'To Abolish the Kancha System (Auction of Grazing Lands) in Taken over Estate Villages of Nellore District'."

శ్రీ కె. వెంకటరావు:—ప్రభుత్వము ఇప్పుడు private estates అన్నీ తీసుకున్న తరువాత వాటిలోను అదివరకు ప్రభుత్వము యొక్క స్వాధీనములో వున్న estates లోను, జరిగే పద్ధతిలో కొంత తేడా వచ్చింది. కాని, ఏ ఏ గ్రామాలలో ఎంతెంత కంచె వున్నది, ఎన్ని ఎకరాలు వున్నది అనేది తేల్చటానికి సర్వే సెటిల్‌మెంటు పూర్తి అయితేగాని, యిది తేల్చడము కష్టముగ ఉంటుంది. ఆ కారణము చేత యిది ఆగియున్నదేకాని వేరే ఏమీ లేదు ఈ రెండు రకాలు ఎస్టేట్సులో వున్న కంచెల విషయములో ఒకే పద్ధతి అవలంబించాలనే ప్రభుత్వం నిర్ణయించుకున్నది. ఈ విషయము యిదివరకు గౌ. సభ్యులు చర్చించిన సందర్భములోనే నేను ఆ విషయము గురించి చెప్పాను. కాబట్టి సెటిల్‌మెంటు రిపోర్టు రాగానే దాని యొక్క సాధకబాధకములు అన్నీ సమగ్రంగ ఆలోచించి, వీటిలో ఎలాంటి పద్ధతి అవలంబిస్తే మంచిదో ఆలోచించి చేస్తాము అక్కడ యిప్పటివరకు పశువులు మేపుకునేవారికి ఉండే కష్టములు తొలగించాలనే ప్రభుత్వం యీ నిర్ణయానికి వచ్చింది. ఈ విషయమును గురించి మొన్ననే మనవి చేసినను, ఇది యిప్పటి వరకు ఒక శాసనము, రూలు, పద్ధతికి సంబంధించి ఉన్నది. ఆ శాసన నిబంధనలు మార్చేటంతవరకు ఈ వ్యవహారము adjournment motions తో ముడిపెట్టితే, యిక్కడ ఆ విషయమును గురించి చర్చించటానికి కష్టముగ ఉంటుంది. కాని మరల యీ విషయమే వచ్చినదన్న సంగతి నేను వినలేదు. 1948వ సం.లో చట్టము ప్యాసు అయింది. అప్పటి నుంచి యింతవరకు యీలోగా ఎన్నో amendments ప్యాసు అయినవి. దాని క్రింద సర్వే సెటిల్‌మెంటు జరగబోతున్నది. అందులో ముఖ్యంగా నెల్లూరు జిల్లాలోని సర్వే సెటిల్‌మెంటు అంతా 1958వ సం. జూన్ నెలలోగానే పూర్తి అవుతుంది అని అనుకుంటున్నాము. అందువల్ల యీ సెటిల్‌మెంటు అంతా పూర్తి అయ్యేటప్పటికి వారు fair Notification యిచ్చేటప్పుడు యీ కంచెలు అన్నీ ఎక్కడెక్కడ ఉన్నవో వాటికి యిదివరకు ఉన్న పద్ధతులన్నీ సమన్వయపరచి ఏదైనా ఒక పద్ధతిలో వేలము వగైరాలు అవసరము లేకుండా చేసే దృష్టి ప్రభుత్వానికి ఉన్నదని మాత్రం మనవి చేయగలను.

## Adjournment Motion re: First Report of the Estimates Committee

*Mr. Speaker:* Notice of an Adjournment Motion given by Sri Basava Manayya is as follows.

"శ్రీ గౌ. ఇరిగేషన్ మంత్రిగారికి, 30–10–1957వ తేదీన శాసనసభముందు పెట్టబడిన ఎస్టిమేట్సు కమిటీవారి మొదటి రిపోర్టు కె. సీ. కెనాల్ రిపేర్సు కట్టడము గురించి సుమారు నాలుగు కోట్లు ఖర్చుచేయబడ్డవని, ప్లానులో 80వేల ఎకరముల భూమి సాగుదలకు రానున్ననూ

14 వేలు మాత్రమేనని తేలినది. 3.9 కోట్లు ఖర్చుచేసినను మూడు వందల ఎకరములు మాత్రమే క్రొత్తగా సాగుదలకు వచ్చినదని లైనింగు వర్కు బాగు లేక నష్టము కలిగినదనియు, 24 బ్రిడ్జీలు ఏవో అవసరాలకు సహాకారంగా లేక ప్లాంటేషను జరుగక, మధ్య మార్పుల గురించి ప్రభుత్వమునకు తెలుపక, low rate టెండర్లను నిరాకరించి తక్కువ రకపు మెటీరియల్ వాడి అన్‌క్వాలిఫైడు మేస్త్రీలచే పని జరిపి, సిమెంటులేని కాలములో మార్కెటునందు విరివిగా అమ్మబడడము మొదలైనవి జరిగి మొదటి సం.లోనే లైనింగు నీటిలో కొట్టుకుని పోయిన దని, 3.9 కోట్ల ప్రజాద్రవ్యము దుర్వినియోగము జరిగినదని తేలినది. దీనిచే ఒక ఆందోళన కలిగినది. కాన తక్షణం సభను వాయిదా వేసి ఆ విషయము చర్చించ ప్రార్థన.''

ఈ motion ను గురించి చర్చించటానికి అవకాశము అడుగుతున్నారు. కాని యీ motion లో అవసరమైన విషయము ఏమీ లేదు. ప్రభుత్వమువారే దీన్ని గురించి discuss చేసి, చెప్పటానికి మంత్రిగారు ready గా ఉన్నప్పుడు దీన్ని సభ ఎదుట పెట్టుతాను. ఇది general discussion లో వస్తుంది గనుక ప్రస్తుతము యిది adjournment motion క్రిందకు రాదు. ప్రభుత్వమువారిని యీ విషయమును Business Advisory Committeeలో డిస్కస్ చేయమని కోరుతున్నాను. అందులో వారు discuss చేసి, బాగా examine చేసి, తరువాత ఏమి చేయాలో చెబుతారు అది ఈ sessionలో ఎప్పుడో వస్తుందో ఆ విషయము Business Advisory Committee లో పెట్టిన తరువాత నిర్ణయిస్తాము.

శ్రీ బసవ మానయ్య (ఆంధ్రోలు) :—అధ్యక్షా, ఈ శాసనసభ నుంచి ఎన్నుకోబడినటువంటి శ్రీ గోపాలరావు ఎక్బోటే మొదలైనవారు సమగ్రంగా పరిశీలించి యీ రిపోర్టును అందించారు. ఈ రిపోర్టులో నాలుగు కోట్ల రూపాయలు దుర్వినియోగంచేయబడ్డాయని living పనులు బాగా కాలేదని............

మిస్టర్ స్పీకర్ :—అదంతా యిప్పుడు చెప్పవలసిన అవసరంలేదు. మీరు యిప్పుడు ఏదో చెప్తే మళ్లా దానికి జవాబివ్వడం ఆ మాదిరిగా యిప్పుడు చర్చచేయడానికి వల్లకాదు. దానిని చర్చచేయకూడదని నేను యిదివరకే తీర్పు యిచ్చాను. ముందు దీనిని ప్రభుత్వం చూడాలి. చూసి సంజాయిషీ చెప్పడానికి తయారుగా వుంటారు. Business Advisory Committeeలో అంగీకరింప బడితే తప్ప యిప్పుడు మీరు దీని విషయంలో మాట్లాడడానికి అధికారంలేదు; allow చేయను. కనుక next subject కు పోతున్నాను.

శ్రీ పి. వెంకట సుబ్బయ్య (రాజంపేట–రిజర్వుడు) :—రాష్ట్రంలోని ఆహార పరిస్థితి చర్చించడానికి Business Advisory Committee లో ఏ తేదీ నిర్ణయించారు.

మిస్టర్ స్పీకర్:— Business Advisory Committee చేసిన నిర్ణయం తమ ఎదుట పెడుతున్నాను. ఇవ్వాళ్ళ Non-Official day. రేపు ఆదివారము. Discussion and voting on the Appropriation Bill, Madras Estates Land Abolition and Conversion into Ryotwari

(Andhra Pradesh Amendment Bill), Andhra Land Revenue, Additional Wet Assessment Bill, ఇవి నాలుగో తారీఖున వస్తాయి. 5వ తారీఖున Andhra Pradesh Land Revenue (Surcharge) Bill వస్తుంది. ఆరవ తారీఖున food situation పై చర్చ జరుగుతుంది. అందరూ మాట్లాడడానికి అవకాశం వుంటుంది ఆరో తారీఖున యిదే ముఖ్యమైన subject వేయడమైనది. 7వ తారీఖున 9–30 మొదలు 12 గంటలవరకు The Andhra Pradesh Commercial crops Assessment Bill, 12 మొదలు 1–0 గంటవరకు Discussion on the Bhadra chalam boat tragedy Enquiry Committee Report. ఎనిమిదవ తారీఖున Consultation of the Rules Committee Report ఇది Business Advisory Committee వారు నిర్ణయించినదని సభవారు గుర్తించాలని కోరుతున్నాను. Now we shall take up the non-official business.

## The Andhra Dowry Prohibition Bill, 1955.

[*Mr. Deputy Speaker* in the *chair*]

*Mr. Deputy Speaker:* The hon. Member Srimati C. Ammanna Raja will move for consideration the Andhra Dowry Prohibition Bill, 1955.

*Sri K. Subba Rao (Hindupur—General):* What is the difference between 'Kanyasulkam' and 'Varasulkam' ?

*Mr. Deputy Speaker:* I hope the hon. Member has gone through the Bill.

*Sri K. Subba Rao:* There is nothing about it in the Bill.

*Srimati C. Ammanna Raja (Attili):* Sir, I beg to move:

"That the Andhra Dowry Prohibition Bill, 1955, be taken into consideration."

*Mr. Deputy Speaker:* Motion moved.

* శ్రీమతి సి. అమ్మన్నరాజా :—అధ్యక్షా, విశిష్ట సమితిచే నివేదింపబడిన ప్రకారం 1956 సంవత్సరం ఆంధ్ర వరకట్న నిషేధ చిత్తు చట్టం తమ ముందుంచి యోచింపవలసినదిగా ప్రతిపాదిస్తున్నాను. దీనిని వరకట్న నిషేధ చట్టం అని పిలుస్తారు. కాని ఒక సెక్షనులో, వారు సరిగా చదివినట్లయితే యీ పార్టీవారు వారికీయడం, ఆ పార్టీవారు opposite party వారికివ్వడం కూడా యిప్పుడున్న సెలెక్టు కమిటీ రిపోర్టు ప్రకారం నిషేధించబడ్డది. శ్రీ సుబ్బారావుగారు దానిని చదువుకుంటే అర్థం అయేది.

శ్రీ కె. సుబ్బారావు :—నేను కన్యాశుల్క వరశుల్కమన్నాను.

శ్రీమతి సి. అమ్మన్నరాజా :—వారు ఏ పేరు పెట్టి అయినా పిలువవచ్చును. వారు వీరికి గాని వీరు వారికిగాని ఈయడం తప్పని దీనిలోవుంది. కావలిస్తే గౌరవ సభ్యులు దానిని మార్చు కొనవచ్చును. ఈ బిల్లు ప్రారంభంలో ప్రవేశపెట్టినది శ్రీ కాళేశ్వరరావుగారని మీకందరకూ తెలిసిన విషయమే. ఇది ప్రవేశపెట్టబడి రెండు సంవత్సరాలయినది. మొట్టమొదట సెప్టెంబరు 1955లో యీ బిల్లును ఆంధ్రశాసనసభలో శ్రీ కాళేశ్వరరావుగారు ప్రవేశపెట్టారు. ఆ తరువాత ప్రజాభిప్రాయం కొరకు ప్రచురించారు. ఆ అభిప్రాయాలన్నీ సేకరించిన తరువాత సెలెక్టు కమిటీకి పంపవలసినదిగా ఆగస్టు 1956న వారు...............

శ్రీ ప్రగడ కోటయ్య (చీరాల) :— On a point of information, Sir. వీరికి వారివ్వడంగాని వారికి వీరివ్వడంగాని వుండదంటున్నారు. అసలు పెళ్ళి జరిగేది ఎలాగండి?

శ్రీమతి సి. అమ్మన్నరాజా :—పిల్లని, పిల్లవానికి యిచ్చుకోవచ్చు గాని డబ్బు యివ్వకూడదు. ఈ బిల్లును ఇదివరకే సెలెక్టు కమిటీకి refer చేశారు. సెప్టెంబరు 1956లో సెలెక్టు కమిటీ సమావేశమైనది. అందరి అభిప్రాయాలు తీసుకొన్నది. బెజవాడలో చాల మంది వచ్చి, "దీనిని ఎలాగయినా తీసివేయవలసినది, యిది చాలా దురాచారం" అని దాంట్లో వున్న కష్టసుఖాలన్నీ చెప్పారు. దానికి ప్రస్తుతపు ముఖ్యమంత్రిగారు, అప్పటి ఉప-ముఖ్యమంత్రిగారు Chairman గా వుండినారు. చాలా తీవ్రంగా ఆలోచించాము. కూడదు అన్న కొన్ని విషయాలు తీసివేయడమైనది. ఇప్పుడున్న ప్రకారం యిదీ కనీసం అమలులో పెట్టడానికి వీలయినట్టుగా ఉంచి, చాలా నిషేధాలుపెట్టి దానిని అమలు జరుగకుండా చేయడానికి కాకుండా, తప్పనిసరిగా అమలులో పెట్టాలి అన్నవిషయాలు మాత్రం ఉంచి మిగిలినవన్నీ తీసివేయడమైనది. అయితే ఆంధ్రప్రదేశ్ ఏర్పడేపూర్వం యిది జరిగింది కనుక తెలంగాణా ప్రాంతంవారికి దీని ప్రారంభం తెలియదు. ఇది మనం ప్రారంభించి మనకు అనుకూలంగా వున్నట్లు రూపొందించాము. అక్కడా ఇక్కడా సాధారణంగా వరకట్నాలకు సంబంధించినంత వరకు ఒకే అలవాట్లు, ఆచారాలు ఉన్నాయనుకుంటాను. సాధారణ చర్చలో యిదివరకు వారు పాల్గొనివుండరు. అయితే యిప్పుడు సెలెక్టు కమిటీ రిపోర్టు మీద తప్పకుండా వారు కావలసిన సలహాలు చెప్పవచ్చు. ఏవయినా లోపాలున్నట్లయితే తప్పకుండా దిద్దుకోవచ్చు. సవరణల రూపంగా యీరోజయినా పెట్టుకోవచ్చు. ఈ వరకట్నం అనేదాని గురించి నేను ముఖ్యంగా ఒక విషయం చెప్పబోతున్నాను. ఒక సెక్షనులో కన్యలకు వరుడు తరఫువాళ్ళు కూడా ఈయకూడ దని వున్నప్పటికీ కూడా నా అభిప్రాయంలో అదీ కొంచెం మార్పించవలసినదేనని వరకట్న నిషేధము అనే ఉద్దేశ్యముతో పెట్టాముగాని అమ్మాయికి అబ్బాయికి తరఫువాళ్ళు నగలు, బట్టలు పెట్టినట్లయితే అది కన్యాశుల్కం అని నిషేధించకూడదు. అసలు కన్యాశుల్కం అనేది యిప్పుడు ఆచారంలోలేదు. అది ఏదో కొన్ని కులాలలో అనగా చాకలి, మంగలివారిలో ఆచారంగా వుందట. అది చాలా negligible గా వున్న విషయం కాబట్టి దానిని యీ చట్టంలో తీసుకువచ్చి బాధాకరంగా చేసుకోవడం అనవసరమని నా అభిప్రాయం. ఆ amendment కూడా అవసరం వచ్చినప్పుడు తీసుకువచ్చి యిదీ పూర్తిగా వరకట్న నిషేధంగానే రూపొందిస్తే బాగుంటుందని నా అభిప్రాయం. వరకట్న నిషేధం అనేది ప్రచారం ద్వారా చేయాలేగాని శాసనంవల్ల........

*Sri R. L. N. Dora* (Tekkali): On a point of order, Sir. Can the sponsor of a Bill speak against the Bill.

*Srimati C. Ammanna Raja:* I am not speaking against the Bill.

*Mr. Deputy Speaker:* She is not speaking against the Bill.

శ్రీమతి సి. అమ్మన్నరాజా:—దాంట్లో కొన్ని లోపాలు వున్నట్లయితే మనం సవరించుకొనవచ్చునని చెప్పాను గాని దానికి వ్యతిరేకంగా చెప్పడానికి నేను నిలవనే అక్కరలేదు కదా? బిల్లును ఉపసంహరించుకోవచ్చు. ఈ వరకట్నం అనేది చాలా బాధాకరంగా ఉన్నది. ఈ దురాచారం చాలా కాలంగా వున్నప్పటికీ, పోవలసిన విషయం అయినప్పటికి ఈ చట్టం అమలులో పెట్టటం కష్టం అని చాలామంది చెబుతున్నారు. ఏ సంఘ సంస్కరణ చేసినప్పటికీ అమలులో పెట్టడం అనేది కష్టం. ప్రజాభిప్రాయం వుండాలి. ప్రజా సహకారం వుంటే తప్ప కష్టమే. కాని శాసనం వున్న తరువాత శాసనమును ఉల్లంఘించడానికి చాలమంది సంశయిస్తుంటారు. కాబట్టి శాసనం చేసినప్పటికీ దొంగతనం చేసినట్టుగ మాత్రమే అనేక పనులు చేయవచ్చు. కాబట్టి శాసనానికి విరుద్ధమని మనవు రూపొందించినట్లయితే తప్పకుండా సంఘములో కావలసిన సంస్కరణ జరుగుతుందనే వుద్దేశముతో దానిని పెట్టారు. ఇది చాలా అవసరమైన బిల్లు. అన్ని స్త్రీ సంస్థలే కాకుండా మహిళా వుద్యమాలే కాకుండా అనేక మంది, ఇది చాల అవసరమని దీనిని పెట్టాలని చెప్పారు. దీనిని బొంబాయిలో కూడా యిదివరకే పెట్టి వున్నారు. మిగిలిన ఏ ఏ దేశాలలో ఈ పరిపాటి వుందో నాకు తెలియదు కాని ఆంధ్రదేశములో అమ్మాయిలు పుట్టేరు అనేటప్పటికీ చాలా బెంగ పెట్టుకుంటారు. ఎంతో దురదృష్టమనుకుంటారు. "మళ్ళీ, అమ్మాయేనా" అంటారు. పెదవి విరుస్తారు. నిజముగా అబ్బాయిలు కన్న అమ్మాయిలే ఎంతో బుద్ధిమంతులు అయినప్పటికీ, దేశానికి ఉపయోగకరంగా ఎంతో న్యాయంగా వున్నప్పటికీ కూడా కష్టసుఖాలనెన్నో ఓర్చినప్పటికీ కూడా అమ్మాయిలు పుట్టారనేటప్పటికి ఒక కష్టమైన విషయంగా ఆలోచించడం జరుగుతోంది. అది చాలా దురదృష్టకరమైన విషయం. ఎందువల్లనంటే, పెండ్లిండ్లు చేయడం కష్టం కాబట్టి ఏదో ఒక వర్గంవాళ్ళుంటారు, చిన్నప్పటినుంచి అల్లారుముద్దుగా బిడ్డలను పెంచుకుంటారు. మళ్ళీ వారికి సమానమైన కుటుంబాల లోనే యిచ్చి పెళ్ళిచేయాలనే ఆశిస్తారు. ఎంతో సుఖముగా పెరిగిన ఒక అమ్మాయి పెళ్ళి ఒక బీద ఇంట్లో వుండి కష్టపడ్డం అంటే ఎంతో బాధపడతారు. కాబట్టి నానా కష్టాలుపడి పెద్ద కట్నాలిచ్చి పెళ్ళిళ్ళు చేస్తుంటారు. ఎంత కష్టమైనప్పటికీ, భరించలేక పోయినప్పటికీ పెద్ద కట్నాలిస్తారు. అటువంటి ఆచారాలవల్ల బిడ్డలు చాలా బాధ పడుతూంటారు. "తల్లి దండ్రులకు ఎంత బాధాకరంగా తయారైనామో, మనకు పెళ్ళిళ్ళు చేయడానికి అప్పుల పాలై నానా అవస్థలు పడుతున్నారు, వీళ్ళు బీదవాళ్ళుగా తయారై పోతున్నారు," అని చాలా బాధపడి కొన్ని చోట్ల ఆత్మహత్యలు చేసుకోవడం కూడా మనం చూస్తున్నాం. కొన్ని చోట్ల ఆడపిల్లలు ఆత్మహత్య చేసుకుంటున్నందువల్ల, తల్లిదండ్రులకు మతి భ్రమణము కలిగి నానా అవస్థలు పడుతున్నారు. ఇటువంటి దురాచారాన్ని తొలగించటానికి మీరంతా సహకరించాలని కోరుతున్నాను. చదువుకొని, పెద్ద అధికారంలో వున్న వాడే బేరానికి వస్తున్నారు. సంస్కృతి లేనివారుగా తయారు అవుతున్నారు. పెండ్లి చేసుకున్న తరువాతకూడా

"మీ నాన్న ఇస్తానని చెప్పిన డబ్బు అంతా ఇవ్వలేదు. ఇంకో అల్లుడికి ఇచ్చినంత నాకు ఇవ్వలేదు. మిగిలిన డబ్బు తీసుకు వస్తేనే రా. లేక పోతే పుట్టిన ఇంట్లోనే వుండు" అని పలికే యువకులు వున్నారు. చదువుకొని పెద్ద వుద్యోగములలో వున్న మహానుభావులు కూడా ఈ డబ్బు కొరకు షైలాక్‌లవలె అనేక బాధలు పెట్టటం జరుగుతోంది. ఆ ఆచారము వుంది కనుక అవన్నీ సహిస్తున్నాము. అటువంటి అలవాట్లనన్నిటినీ తొలగించటానికి ఈ బిల్లును తీసుకువస్తున్నాము. స్త్రీ అంద చందాలు, పేరు ప్రతిష్టలు, విద్యా బుద్ధులు ఈనాడు ఎవ్వరూ చూడటం లేదు. యిచ్చే తాహతు వున్నవారో, లేని వారో అనే విషయము ఆలోచించకుండా "ఎంతకట్నం ఇస్తారు? నాకు ఇంతకట్నం కావాలి, ఇంత మీరు యివ్వకపోతే ఇంకొకరు ఇస్తారు" అని చెప్పేవారున్నారు "వారి కుటుంబములో నేను ఒక వ్యక్తిని కాబోతున్నాను, వారి కష్టములు నేను పంచుకోవాలి" అనే వుద్దేశ్యమే వారికి లేదు. వరవిక్రయమని చెప్పినా సిగ్గు, అవమానము లేకుండా డబ్బు కొరకు అన్ని సహిస్తున్నారు. ఈనాడు డబ్బుతోనే అన్ని పనులు జరుగుతున్నాయి. అట్లాగే ఇదికూడా జరుగుతోంది. "దేవదాసి చట్టం, ప్రొహిబిషన్ చట్టం అమలు పెట్టడము కష్టము అయినది. బ్లాకుమార్కెటు జరుగ వచ్చు. అవి మన నోటీసులోనికి రాకపోవచ్చు. రుజువుకావటం కష్టం. కేసుపెడితే వృధా అవుతుంది" అని కొందరు సభ్యులు చెప్పవచ్చు. ఈ శాసనము వచ్చిన తరువాత కొంచెము ఆత్మగౌరము కలవారు ఆ విధముగా చేయటానికి సంకోచిస్తారు. సంఘములకు సంబంధించిన విషయాలను సంఘ సంస్కర్తలు ప్రచారము చేయాలిగాని, శాసనము చేయకూడదని కొందరు అన్నారు. ఇప్పుడు ఉపయోగించక పోయినా ముందు ముందైనా ఆచరణలోకి వస్తుందని ఈ బిల్లు పెట్టుచున్నాను, శారదా చట్టానికి వ్యతిరేకంగా పెండ్లి చేయటానికి ఈనాడు సందేహిస్తున్నారు. అస్పృశ్యతా నివారణ శాసనం పూర్వం హరిజనులు దేవాలయము లోనికి, హోటళ్ళలోనికి ప్రవేశించటానికి వారు భయపడేవారు. ఈ వరకట్న నిషేధబిల్లుకు మేము కొన్ని amendments ఇచ్చాము. తరువాత క్లాజువారి చర్చ జరిగేటప్పుడు ప్రతి విషయము గురించి ఆలోచించవచ్చు. అప్పుడు అవసరమైతే యింకా కొన్ని amendments ప్రవేశపెట్టి loopholes లేకుండా మంచి శాసనముగా చేయవచ్చు. ఇప్పుడు చాలామంది ఈ విషయములో చాలా శ్రద్ధ తీసికొంటున్నారు. దీనిలో ఏమైనా లోపాలు వున్నట్లు అయితే సలహాలనిచ్చి వారి అభిప్రాయాలను ప్రతివారు తెలియ చేయాలని కోరుతున్నాను. ఇది ప్రయివేటు విషయముకదా మాకెందుకని అనుకోకుండా మినిస్టరులు కూడా వారి అభిప్రాయములను తెలియ జేసి తగిన సలహాలను ఇవ్వాలని కోరుతూ ఈ బిల్లును ప్రవేశ పెడుతున్నాను.

శ్రీ ఎల్. లక్ష్మణదాసు (పాతపట్నం—జనరలు) :—ఉపాధ్యక్షా, ఈ వరకట్న నిషేధపు బిల్లును 1955 సంవత్సరములోనే తెచ్చినారు.

శ్రీ కె. వెంకటరావు :—ఆంధ్రదేశములోనా? ఆంధ్రప్రదేశములోనా?

మిస్టర్ డిప్యూటీ స్పీకరు :—ఒక గౌరవ సభ్యులు మాట్లాడేటప్పుడు అనవసరముగా ఇతర సభ్యులు జోక్యం కలుగ చేసుకోరాదు. మాట్లాడ దలుచుకుంటే ఆ సభ్యుని address చేయకుండా chair ను address చేస్తే బాగుంటుందని ఈ విషయాన్ని అందరు గమనించాలని నా ప్రార్థన.

శ్రీ ఎల్. లక్ష్మణదాసు:—ఉపాధ్యక్షా, ఈ బిల్లును 1955 లో ఆంధ్రరాష్ట్రములో ఈనాడు మన స్పీకరు అయిన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు ప్రవేశ పెట్టారు. అప్పుడు అది ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినది. కాని ఇప్పుడిది ఆంధ్రప్రదేశ్ అంతటికీ వర్తించేటట్లు ఒక amendment తీసుకు రావలసి వుంది. ఈ బిల్లు ఎందుకు ప్రవేశ పెట్టబడిందో ఆంధ్రదేశములో అనేక మంది, అనేక ప్రాంతాలవారు తెలియ చేశారు. ఆడపిల్లల పెళ్ళికి కట్నం ఇవ్వకుండా చేయటమే ఈ బిల్లుయొక్క ప్రధానమైన ఉద్దేశ్యము. ఈ కట్న పిశాచివల్ల గౌరవ కుటుంబములోని పిల్లలకు కూడా పెళ్ళిళ్ళు కాకుండా చాలా బాధలకు లోను కావటం జరుగుతోంది. పురాతన కాలమునుండి బంగారమును గాని, డబ్బునుగాని dead capital గా ప్రయోగు చేసుకోవటం ఈ దేశములో జరుగుతోంది. సాంఘిక విప్లవమునకే కాక ఆర్థిక రంగములో కూడ కొంతవరకు ఉపయోగ పడుతుందనే ఉద్దేశ్యంతో ఈ బిల్లు ప్రవేశ పెట్టి వుంటారని నేను భావిస్తున్నాను. ఈ బిల్లు అమలు జరుగుతుందా? లేదా అనే విషయముపై అనేక మంది అనేక విధాలుగా ఊహాగానం చేయవచ్చు. 1930 లో శారదా బిల్లు వచ్చినప్పుడు "ఈ బిల్లు అమలు జరుగుతుందా? భారతదేశములో చిన్న పిల్లల పెండ్లిని నిషేధించగలరా" అని కొందరు అనుకొన్నారు. 1950 నుండి 1957 వరకు చూచుకుంటే చిన్నపిల్లలపెండ్లి ఎక్కడా జరగటము లేదు. శారదా చట్టం చాలావరకు ఉపయోగ పడినట్లు మనం ఈనాడు భావిస్తున్నాము. అట్లాగే కాల క్రమేణా ఈ బిల్లు కూడా ఉపయోగపడుతుంది. ఇది కేవలం ఆంధ్ర జాతికే కాక భారత జాతికే ఉపయోగ పడుతుందని నేను భావిస్తున్నాను. ఈనాడు ముఖ్యమంత్రిగా వున్న శ్రీ సంజీవరెడ్డిగారు సెలక్టు కమిటీకి ఛైర్మన్‌గా వుండటం, అన్ని పార్టీల వారు ఆ కమిటీలో వుండటం వలన ఈబిల్లును క్షుణ్ణంగా చర్చించడం జరిగింది. అవసరమైతే మార్పులు తీసుకువచ్చి Pass చేయాలని కోరుతున్నాను. ఆంధ్రదేశానికి సంబంధించిన ఈ బిల్లు ఆంధ్రప్రదేశానికి విస్తరింప చేస్తున్నాము. కనుక ఈ బిల్లుపై చర్చలలో తెలంగాణా సభ్యులు కూడా హెచ్చుమంది పాల్గొని, వారి వారి అభిప్రాయాలు తెలియజేయటమే కాక, దానిని అమలు పర్చటానికి కృషి చేస్తారని ఆశిస్తున్నాను. కట్నాలవల్ల దేశములో జరుగుతున్న అన్యాయాలు మన అందరికీ తెలుసు. కట్నాలు యివ్వనిదే పెండ్లికాని రోజులు ఈ నాడు వచ్చాయి. "సివిలిజేషన్" అని చెప్పుకుంటూ ఇలాంటి పనులు చేస్తున్నారు. ఏ ప్రాంతములో సివిలిజేషన్ హెచ్చుగా వున్నదో అక్కడే ఈ కట్నపు బాధ ఎక్కువగా వుంది. ఎంత తెలివి తేటలుగల పిల్లలకు అయినా, వారు ఎంత ముద్దుగా పెరిగినా, తల్లిదండ్రులు కట్నం యివ్వకపోతే ఆ పిల్లలకు పెండ్లి కాని పరిస్థితులు ఈనాడు దేశంలో ఏర్పడినవి.

ఇది దేశంలో ప్రతి ఒక్కరికీ సంబంధించిన విషయం. ధనవంతులు, బీదవారు అంతా కూడా పిల్లనిచ్చేటప్పుడు కట్నం యెందుకు యివ్వాలి అనే విషయాన్ని జాగ్రత్తగా ఆలోచించాలి. ఈ శాసనం విషయం అందరూ పట్టుదలతో పనిచేసినప్పుడు యిది ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది. కొన్ని కొన్ని జిల్లాలలో లక్షల కొలదీ రూపాయలు కట్నం యిస్తున్నారు. ఇందువల్ల పల్లెటూళ్లలోని రైతుల ఆర్థిక పరిస్థితులు ఏవిధంగా మారుతున్నాయో చూడవలసియున్నది. బీద వారు కూడా ఎక్కువ ఖర్చుచేసి, గొప్పగా పెండ్లిండ్లు చేస్తున్నారు. మనమెందుకు చేయకూడదనే భావాలతో కట్నాలు హెచ్చుగాఇచ్చి డాంబికంగా పెళ్ళిళ్ళు జరుపుతున్నారు. 50 వేల రూపాయలు కట్నంగా వచ్చేటప్పుడు కనీసం 20 వేల రూపాయిలు అయినా ఖర్చుచేసి డాంబికంగా

చేయాలనే తలంపుతో పెళ్ళిళ్ళుచేసీ, ఆస్తులు పాడుచేసుకొని ఎన్నో కుటుంబాలు నాశనమై పోతున్నాయి. డబ్బున్నవారు ఈ విధంగా నాశనమైపోతున్నారు. లేనివారు తమ ఆడపిల్లలకు 20, 25, 30 ఏండ్లు వచ్చినా పెళ్ళిళ్ళు కాక అనేక బాధలుపడుతున్నారు. ఈ విషయాలన్నీ గమనిస్తే యిది సామాన్యమైన బిల్లు కాదని, దీని ప్రాముఖ్యత తక్కువ కాదని తెలుస్తుంది. దేశంలోని ప్రతి రాష్ట్రం లోనూ ఈ బిల్లును అమలుచేయడానికి ప్రతి ఒక్కరూ అంగీకరిస్తారని భావిస్తున్నాను. 'ఇదేదో అనధికార బిల్లు, తక్కిన social reforms, prohibition మొదలైనవి జయప్రదంగా అమలు జరిగాయా ?' అనే అభిప్రాయంతో తీసుకోకూడదు. ఇది ప్రజలందరికీ సంబంధించిన బిల్లు. ఆర్థిక పరిస్థితులను చక్కదిద్దుకోడానికి సంబంధించిన విషయం యిది. ఈనాడు 50 వేల రూ. లు కట్నం వస్తే 30 వేల రూ. ల బంగారం పిల్లకు పెట్టవలసిన పరిస్థితి ఉన్నది. మనదేశంలోని బంగారమంతా dead capital రూపంలో ఆడవారి ఒంటి మీద ఉన్నది. ఈ బిల్లును అమలుచేయడమే కాదు, బంగారు నగల రూపంలోని dead capital ను బయటకు తెచ్చి ప్రభుత్వానికి అప్పు రూపంగా యిచ్చేటట్లు చేయాలని నేను స్త్రీ సభ్యులకు కూడా మనవి చేస్తున్నాను. అట్లా చేసిన నాడు మనం ఏ అమెరికాకో, రష్యాకోపోయి డబ్బు అడగవలసిన దుస్థితి ఉండదు. ఎన్నో కోట్ల రూపాయలు భారతదేశంలోని స్త్రీల ఒంటిపై బంగారం రూపంలో ఉన్నదనే విషయం అందరకూ తెలుసు. పైగా పెళ్ళిళ్ళ సమయంలో పెట్టిన బంగారం ఏ పరిస్థితిలోనూ బయటకు పోకూడదు, తన చేతిలోనే ఉండాలనే మనస్తత్వంతో ఈనాడు స్త్రీలు ఉండడంవల్ల మన దేశం దుస్థితికి రావడానికి కారణమవుతోంది. ఈనాడు దేశంలో ఉన్న బంగారమంతా బయటకువచ్చి, అభివృద్ధి కార్యక్రమాలను సాగించుకుంటే మనం ఇతర దేశాలకువెళ్ళి 'దేహి' అని అడగవలసిన అవసరంలేదని చెబుతున్నాను. కట్నాలు యిచ్చుకోవడం తగ్గినప్పుడే స్త్రీలు బంగారు నగలు ఎక్కువగా పెట్టుకోవడం తగ్గుతుంది. ఇది social reform మాత్రమే గాకుండా economic reform క్రిందకు కూడా వస్తుంది. ఇది non-official Bill సామాన్యమైన బిల్లు అని ఎవ్వరూ భావించకూడదు. ఈబిల్లు యొక్క ప్రాముఖ్యతను పత్రికల ద్వారా ప్రచారంచేస్తే దేశంలోని అందరూ దీని అంగీకరిస్తారు.

ఇప్పటి పరిస్థితులలో ఆడపిల్లలు కలిగిన చాలా కుటుంబాలవారు ఆవేదనతో బాధపడుతున్నారు. ఒక్క మన రాష్ట్రంలోనే కాదు, బెంగాల్ రాష్ట్రంలో కూడా ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కాని కారణం చేత అనేక చెప్పరాని విషయాలు జరుగుతున్నాయి. కట్నాల విషయంలో బెంగాల్ మన రాష్ట్రాన్ని మించింది. చివరకు పెళ్ళిళ్ళు కావడమే కష్టమైపోతున్నది. మన రాష్ట్రంలో కృష్ణా, గుంటూరు జిల్లాలలో 2, 3 లక్షల రూ. ల వరకూ కట్నాలు యిస్తున్నారు. స్త్రీని కొనుక్కొంటున్నారా లేక పురుషుడే ఒక స్త్రీకి అమ్ముబడుతున్నాడా అనే విషయం గమనించాలి. దీనిని బట్టి మనం అభివృద్ధి మార్గంలోకి పోతున్నామో, వెనుక బడిపోతున్నామో తెలుస్తుంది. ఒక ప్రక్క నాగరికత పెరుగుతోంది. విజ్ఞానం పెరుగుతోంది. B.A., M.A., pass అవుతున్నారు. ఈ డిగ్రీలకు అనుగుణంగా కట్నాల గ్రేడులు పెరిగాయి. S.S.L.C. నుంచి B.A., M.A., B.E. ,వరకూ grades ఉన్నాయి. B.E. కి సీటు దొరికింది అంటే 30 వేల రూపాయలు కట్నం వస్తుంది. అందువల్ల, కేవలం కట్నంకోసమై సీటుకొరకు

ప్రయత్నం చేసే మహానుభావులున్నారు. B.E. , లేక M.B.B.S. కు సీటువచ్చిందంటే 50, 70 వేల రూ. ల కట్నం వస్తుందనే ఉద్దేశంతో సీటు కొరకు ప్రయత్నం చేసే విద్యార్థులను "మీరు 50 వేలకో, 70 వేలకో అమ్ముడుబోతున్నారా, లేక జీవితాంతం మీతో భాగస్వామిగా వుండే స్త్రీని కొనుక్కొంటున్నారా ?" అని నేను ప్రశ్నిస్తున్నాను. మనం ఈ బిల్లును చాలా దూరదృష్టితో పరిశీలించవలసిన అవసరం ఉన్నది. కట్నాలు ఉండాలని ఎవ్వరూ కోరరు. కాని కట్నాల పద్ధతిని ఏ విధంగా నిషేధించాలి ? దీనిని అమలుచేయడానికి ప్రభుత్వం కట్టుదిట్టమైన ప్రయత్నాలుచేయాలని కోరుతున్నాను. తక్కిన social reforms మాదిరిగా— Child Marriage మాదిరిగా ఏదో జరగనీయండి, క్రమేపీ అదే సక్రమంగా జరుగుతుందని అనుకోకూడదు. ఎంత ధనమైనా ఖర్చుచేసి ఈ శాసనాన్ని అమలుచేయాలి కట్నం యిచ్చేవారినీ, పుచ్చుకొనేవారిని కొంతమందిని శిక్షిస్తేనే గాని ఈ పద్ధతి ఆగదు.

అందుచేత non-Official Bill అనే దృష్టి పెట్టుకోకుండా ప్రభుత్వం కూడా చాలా జాగ్రత్తగా ఆలోచించవలసిన అవసరం ఉన్నది. ఈ శాసనం మన ఒక్క ఆంధ్రప్రదేశ రాష్ట్రానికే గాక, మిగిలిన దేశమంతటికీ ఉపయోగకారిగా ఉండగలదు.

ఈ బిల్లుపై తక్కిన శాసనసభ్యులందరూ, తెలంగాణా నుంచి వచ్చిన సభ్యులూ, ఇక్కడ ఉన్న యితర పార్టీల నాయకులూ, ఇక్కడ యిది చిన్న బిల్లు అని తలంచకుండా వారివారి అభిప్రాయాలను తెలియజేయాలని కోరుతున్నాను. ఈ బిల్లులో మార్పులుచేయవలసిన అవసరముంటే చేయడానికి సిద్ధంగా నున్నానని ఈ బిల్లు move చేసిన అమ్మన్నరాజాగారు చెప్పారు. కాని, యివి సెలెక్టు కమిటీలో అన్ని పార్టీలవారు ఆలోచించి ఏకగ్రీవంగాచేసిన నిర్ణయాలు. నాకు తెల్సినంతవరకూ మార్పుచేయవలసిన అవసరమేమీ లేదు. మార్పులు ఏమీ లేకుండా వెంటనే ఈ బిల్లును pass చేస్తే అమలులో ఏమైనా మార్పులు అవసరమైతే చేయడానికి ప్రభుత్వానికి కొన్ని అధికారాలు ఇవ్వవలసియున్నది. అధ్యక్షుల ద్వారా మరొక్కసారి ఆంధ్రదేశంలోని ప్రజానీకానికీ విజ్ఞానవంతులమను కొనేవారికీ, విద్యార్థులకూ, వారి తల్లిదండ్రులకూ, ధనవంతులకూ పేదలకూ, అందరికీ విజ్ఞప్తిచేస్తున్నాను. మనదేశంలో అభివృద్ధి కార్యక్రమాలు ముందుకు సాగుతున్న ఈ రోజుల్లో మన దేశానికి నష్టదాయకమైన విధానాన్ని ఏమాత్రమూ మిగల్చకుండా నిర్మూలించి ముందుకుపోవాలనే ఈ విషయంలో అందరూ కూడా జాగ్రత్తగా ఆలోచించి, ఈ శాసనం వచ్చినందుకు బాధపడకుండా దేశాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని దేశ కల్యాణానికి తోడ్పడేందుకు ప్రతి ఒక్కరూ ప్రయత్నం చేయాలి. విజ్ఞానవంతులైనవారందరూ వరకట్నాలను నిషేధించడానికి ప్రయత్నించాలని విజ్ఞప్తిచేస్తున్నాను.

ఈనాడు కట్నాలు పుచ్చుకోవడం, ఇవ్వడం చదువుకొన్నామని, విజ్ఞానవంతులమని అనుకొనే వారిలోనే ఎక్కువగాఉన్నది. 20 వేలు, 30 వేలు ఇచ్చి పెండ్లిండ్లు చేయడానికి ప్రయత్నించే దానికన్నా ఆడపిల్లలకు చదువు చెప్పించి ఏ ఉద్యోగానికో పంపడం మేలని కొంతమంది ఆడపిల్లల తల్లిదండ్రులు నాతో చెప్పారు. కడకు ఏ గుమాస్తా ఉద్యోగమైనా చేసుకుందామని చదువుకు పోతున్న ఆడపిల్లలున్నారు. ఇటువంటి దుస్థితి మన దేశానికి ఎందుకు రావాలి ?

శ్రీ పి. సుందరయ్య :—చదువుకొని ఉద్యోగాలు చేసుకోవడం తప్పు పని అవుతుందా ?

శ్రీ ఎల్. లక్ష్మణదాసు :—తప్పు లేదు. ప్రతి స్త్రీ చదువుకోవాలి. చదువుకొని ఎక్కువ విజ్ఞానాన్ని ఆర్జించుకోవాలి. కాని తనకు పెండ్లి కాలేదని, తనకు కాబోయే భర్తకు వరకట్నం ఇవ్వగల శక్తి తన తల్లిదండ్రులకు లేదని ఉద్యోగం చేసుకోడానికి పోతున్నారని విన్నాను. ఇటువంటి దుస్థితి మనదేశంలో రాకూడదనే తప్ప స్త్రీలు స్వతంత్రంగా జీవించకూడదని నా ఉద్దేశ్యం కాదు. స్త్రీలు దేశాన్ని పరిపాలించాలి. పురుషులు చేస్తున్న అన్యాయాలు, అక్రమాలు వాళ్ళను ఈ దుస్థితికి తెస్తున్నాయని నా ఉద్దేశ్యం. ఆడవాళ్ళు చదువుకొని పరిపాలన సాగించినా ఎవరికి అభ్యంతరములేదు. కాని స్త్రీలు ఇంకొక దారిలేక ఉద్యోగానికి రావలసివస్తున్న పరిస్థితులు మార్చాలి. స్త్రీలు అందరు విజ్ఞానవంతులు కావాలి. స్త్రీలు విజ్ఞానవంతులై దేశం యొక్క సౌభాగ్యానికి తోడ్పడినట్లయితే రేపు సాయంత్రానికి భారతదేశమునకు కావలసిన రు. 4,800 కోట్లు మనకు సమకూడగలవు. ఇంత సొమ్ము వారిదగ్గర ఉన్నది. అప్పుడు మనము ఇతర దేశములకు అప్పులకై పోవలసిన పరిస్థితి రాదు. ఈనాడు వారు ధరిస్తున్న బంగారపు నగలపై వారికి కొంత అభిమానము తగ్గాలి. స్త్రీలు తమ బంగారాన్ని దేశసౌభాగ్యం కోసం ఇవ్వాలి. ఈ బరువుతో వారు కృంగి కృశించేకన్నా దానిని వడ్డీలేకుండా ప్రభుత్వానికి ఇవ్వాలి. ఈ విషయాన్ని స్త్రీ సంఘాలు స్త్రీలలో ప్రచారంచేయాలి. స్త్రీలు వారి బంగారాన్ని దేశానికి అప్పగించేటట్లు చేయాలి. అట్లా చేసిననాడు వారు పరిపాలన చేయడానికి అర్హులని చెబుతున్నాను. స్త్రీలు బయటకు రాకూడదనిగాని, స్త్రీలు విజ్ఞానవంతులు కాగూడదని గాని నా ఉద్దేశ్యంకాదు. పెళ్ళిచేయడానికి తల్లిదండ్రుల దగ్గర డబ్బులేదనే కారణంచేత వారు ఉద్యోగాలకువచ్చే పరిస్థితి రాకూడదని నేను మనవిచేస్తున్నాను. అట్టిది భారతజాతికి అవమానకరమని మాత్రం మనవిచేస్తున్నాను. చరిత్రలో ఎపుడు చూచుకున్నా భారతజాతిలో స్త్రీలకు ప్రాముఖ్యత ఉన్నది. కాని ఈనాడు ఈ వరకట్నాలపేరుతో స్త్రీలు వెనుకకు పడిపోతున్నారు. ఈ కట్నాలవల్ల వారు కృంగి కృశించి పోతున్నారు. మొగపిల్లల తల్లిదండ్రులు యీ విషయంలో చాలా ఉదారంగా ప్రవర్తించాలి. పొరుగింటి ఆడబిడ్డలు ఆ విధంగా బాధపడడం వారికి కూడా మంచిదికాదు. వివాహాల సందర్భంగా అనవసర ఖర్చులవల్ల ఎన్నో కుటుంబాలు నాశనం అవుతున్నాయి. ఈ విషయాలను అందరూ తెలుసుకోవాలి. 20 వేల రూపాయలు కట్నం ఇచ్చి పెళ్ళి చేసేటప్పుడు పెళ్ళి సందర్భంలో తన బంధుమిత్రులను సంతోషపరచే నిమిత్తం ఆడంబర ఖర్చులకు ఇంకో 5 వేలయినా ఖర్చుచేసి నందువల్ల ఎన్నో కుటుంబాలు పాడైపోతున్నాయి. ఆ విధంగా చేయడంవల్ల దేశానికి పనికిరాకుండా సర్వనాశనం అవుతున్నారు. ఇటువంటి కుటుంబాలు దేశంలో ఎన్నో ఉన్నాయి. ఇటువంటి అన్యాయాల నరికట్టాలి. ఇందుకు కారణభూతమయిన వరకట్న దురాచారాన్ని నిషేధించాలి. ఈ దురాచారాన్ని అరికట్టనిదే దేశంలో ఎన్ని ప్రాజెక్టులు నిర్మించినా ఎన్ని అభివృద్ధి ప్రణాళికలు అమలుచేసినా, ఎంత అధికాహారోత్పత్తిచేసినా సంఘంలోని అన్ని వర్గాలవారు సుఖంగా ఉండరని మనవిచేస్తున్నాను. రష్యా, జపాను వంటి దేశాలు యుద్ధంవల్ల దెబ్బతిన్నప్పటికి యీ 5, 10 సంవత్సరాలలో దేశ పునర్నిర్మాణంచేసుకో గలిగినారంటే కారణం వారు ఎంతటి బాగ దక్షలతో వ్యవహరించినారో మనం గమనించాలి. ఆ దేశాలలోని స్త్రీలు, పురుషులు తమ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించడం వలననే వారు ముందుకు వస్తున్నారు. వారు చేయవలసిన కార్యక్రమాలను అంకుత దీక్షతో వారు అమలు చేస్తున్నారు గనుకనే ఆ దేశాలు ఇంత త్వరితగతిని పురోగమించ గలుగుతున్నవని మనవిచేస్తున్నాను. మనదేశం ఎన్నో ఏండ్లుగా వెనుకబడి ఉండుటకు కారణం కేవలం

వరదేశ పాలనేకాదు. పరిపాలన వలన కొంత దెబ్బతినినా మనలో ఉన్న యీ సంఘ దురన్యాయాల వల్ల మనం వెనుకబడడం సంభవించినది. కాబట్టి యీ సంఘ దురాచారాలను మనము అరికట్టాలి. ఈ బిల్లు చిన్న బిల్లు అయినప్పటికి దీనిని అందరం ఆమోదించడంవల్ల మన సంఘానికి ఎంతో మేలు కలుగుతుంది. ప్రతి కుటుంబం, ప్రతి పురుషుడు ప్రతి స్త్రీ ఇందుకు తోడ్పడాలని మనవి చేస్తున్నాను. కాబట్టి యీ బిల్లును అన్ని పార్టీలవారు జాగ్రత్తగా ఆలోచించాలని తద్వారా దేశపురోభివృద్ధికి తోడ్పడాలని కోరుతున్నాను. ప్రభుత్వం కూడా యీ విషయంలో తగినంత శ్రద్ధతీసుకోవాలి. దీనిని కట్టుదిట్టముగా అమలుచేయుటకు సర్వప్రయత్నములు చేయవలెనని మనవి చేస్తున్నాను. దీనిని అమలుపరచకపోతే ప్రభుత్వానికి కష్టంకాదు. ప్రభుత్వానికి దమ్మిడీ కూడా ఖర్చుకాదు. కాని సంఘపురోభివృద్ధిని దేశకళ్యాణాన్ని కాంక్షించి దీనిని కట్టుదిట్టంగా అమలు చేయాలి. ఆ విధంగా చేసినగాని అభివృద్ధి పొందదు. దీనిని అన్ని పార్టీలవారు సమగ్రంగా చర్చించడానికి హెచ్చుఅవకాశం తీసుకొని ఇది ప్రజానీకానికి హెచ్చు ప్రయోజనకారిగా ఉండేటట్లు చేయమని కోరుతూ యీ అవకాశమిచ్చినందులకు తమకు నా వందనములు అర్పిస్తున్నాను.

*రాకపోకల శాఖామంత్రి (శ్రీ యమ్. నరసింగరావు) :—అధ్యక్షా, ఈ 'వరదక్షిణ నిర్మూలన, చిత్తు శాసనమును నేను బలపరుస్తున్నాను. అయితే ఈ బిల్లును తెలంగాణా ప్రాంతమునకు కూడ అనువర్తించేటట్లు సవరణ తెస్తారని ఆశిస్తున్నాను. ఇదీ 'వరదక్షిణ' అనండి, లేక సుబ్బారావుగారు సెలవిచ్చినట్లు 'కన్యాశుల్కం' అనండి ; మన సంఘంలో యిదీ ఒక దురాచారంగా ప్రబలింది. నా చిన్నతనములోనాకు వివాహమయినప్పుడు ఏ రెండువందలో, మూడు వందలో వరదక్షిణ యిచ్చివుంటారు. ఈ రోజున అది వేలకువేలు పెరిగిపోయింది. ఆ రోజులలో వరదక్షిణ ఎంత యిస్తారు అని అడుగుట అపచారంగా ఉండేది ; అడిగేవారు కారు. ఇప్పుడు తెలంగాణాలో కంటె, ఆంధ్రలో యింకా ఎక్కువ డబ్బు అడుగుతారని, పిల్లవాండ్లు ఎక్కువ డబ్బు లాగే ప్రయత్నం చేస్తారని వింటున్నాము. నాకు తెలిసినంతవరకు పూర్వం డబ్బుకంటే, ప్రధానంగా వారి కుటుంబ గౌరవమర్యాదలు ఆచార సంప్రదాయాలగురించి ఎక్కువ విచారించేవారు. ఇంకొక ఆచారం ఏమంటే, జమీందారీ వర్గమునకు చెందినవారు జమీందారులలో చేసుకొనటం, కరణాలుగా ఉంటే కరణాల కుటుంబములలో, మునసబులుగా ఉంటే మునసబు కుటుంబాలలో చేసుకొనే ఆచారం ఉండేది. ఇప్పుడు ఈ ఆచారం మారి, ఎవరు ఎక్కువ డబ్బు యిస్తే వారి అమ్మాయిని చేసుకుంటామనే పద్ధతి వచ్చింది. ఎక్కువ చదువుకున్నవాడయితే ఆ చదువు ఖర్చులన్నీ వసూలుచేసే ప్రయత్నం జరుగుతోంది.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు (వడమలపేట) :—పై చదువు ఖర్చులుకూడ ముందే వసూలు చేసే ప్రయత్నం జరుగుతున్నదీ.

శ్రీ యమ్. నరసింగరావు :—మెడిసిన్ చదివేవానికి యింతని, బి. ఇ. అయితే, యింతని **LL.B.,** అయితే యింతని, పదివేలు యిస్తారా, ఇరవై వేలు యిస్తారా, అని అడగటం జరుగుతోంది. కాని యిది మన శాసనసభనుంచి పాస్‌చేసే చట్టంవల్ల ఆగిపోతుందా అనే అనుమానం ఉన్నది. బ్రిటిష్ ప్రభుత్వం ఉన్నకాలంలో శారదా అక్టు పాస్ చేశారు. అప్పుడు యిక్కడ హైదరాబాదులో ఒక శాసనసభ 21 మంది సభ్యులతో ఉండేది. శారదాచట్టంవలె హైదరాబాదు

సంస్థానంలో కూడ ఒకటి కావలెనని నేడు ఒక బిల్లు పెట్టితే నా ఒక్కని ఓటు తప్ప రెండవ ఓటు రాలేదు. ఆ రోజులలో అటు బెజవాడ నుంచి వచ్చి యీ ప్రాంతానికి చెందిన ఎరుర్రిపాలెంలో వందల కొలది వివాహాలు చేస్తూ ఉండేవారు. కాని యీవాళ 18, 20 సంవత్సరముల వయస్సు గలిగిన అమ్మాయి పెళ్ళికాకుండా ఉన్నప్పటికీ సంఘంలో తప్పుక్రింద అనుకోవటంలేదు. రజస్వలానంతర వివాహం, తప్పుగా ఎంచుటలేదు. ఆ విధంగానే ఈ వరదక్షిణ నిషేధ చట్టాన్ని అందరూ పాటించడానికి కొంతకాలం పట్టుతుంది. దానిని మనం యిప్పుడు పాస్‌చేసిన వెంటనే ఆ ఆచారం ఆగిపోతుందని అనుకొనటం పొరపాటు. అయితే దీనికి educative value ఉన్నదని మనవిచేస్తున్నాను. ఈ శాసనం పాస్ చేశామంటే—దానికి ఆంధ్రప్రదేశ్‌లోని మూడు కోట్ల ప్రజల ఆమోదం, support, బలం ఉన్నదని అర్థం. ( Interruption మహమ్మదీయులు తప్ప).

వరదక్షిణ ఆచారం మహమ్మదీయులలో లేకపోలేదు. మెహర్ అనేది పేరు, అది exempt చేశారు. వారిది కంట్రాక్ట్ బేసిస్ కనుక వివాహం అయిన తరువాత 'తలాఖ్' యిస్తే యింత డబ్బు కట్టాలని ఉన్నది. అది పేరు. అది 'వరదక్షిణ', 'కన్యాశుల్కం', అనే దానికి వీలులేదు. వారు కూడ పెళ్ళిలో 'జహెజ్' యిస్తారు. డబ్బు యిస్తారు కనుక హిందువులు, మహమ్మదీయులు, అనే భేదంలేదు. ఈ వరదక్షిణ, కన్యాశుల్కం ఆచారం యిద్దరి దగ్గర, పూర్తిగా ఉన్నది. అయితే ఈ శాసనం పాస్ చేయగానే ఈ ఆచారం పోదు. Black marketing జరగవచ్చును. అయినప్పటికీ ఈ శాసనానికి చాలా విలువ ఉంటుంది. ఈ శాసనానికి 300 శాసనసభ్యుల సహకారమే, ఉండటం కాదు; దేశంలోని సోష్యల్ వర్క్ చేసే సంఘాల అన్నింటి సహకారం ఉంటుంది. సంఘసేవ చేసే కార్యకర్తలందరి సహకారం ఉంటుంది. ఎవరైనా ఈ శాసనానికి విరుద్ధంగా ప్రవర్తిస్తే, అటువంటివారు తాము తప్పుచేస్తున్నారని, దోషంజేస్తున్నామని తల వంచుకోవలసివస్తుంది. ఇప్పటివలె ఎంత డబ్బు వసూలుచేస్తే అంత గొప్పగా భావించుటకు వీలులేదు. తప్పుచేసినట్లు భావించి తలవంచుకోవలసివస్తుంది.

ఈ బిల్లు తెలంగాణా ప్రాంతమునకు కూడ అనువర్తించే విధంగా సవరణ తెచ్చి అందరు ఏకగ్రీవంగా పాస్ చేస్తారని నా సంపూర్ణ విశ్వాసం కలదు. అయితే ఈ బిల్లులో చెప్పబడిన జైలు శిక్షలు, కొంచెం తగ్గించుటకు ఆలోచించాలని మనవిచేస్తున్నాను. ఇటువంటి శాసనంలో అలాంటి శిక్షలు ఉండకూడదని సభ్యుల దృష్టికి తెస్తున్నాను. అందుకు సవరణ తెచ్చి శిక్షలు తగ్గించాలనే సూచన సభవారి ముందు పెట్టుతున్నాను. నాకు ఈ అవకాశం యిచ్చినందుకు కృతజ్ఞుడను.

శ్రీమతి వై. సీతాకుమారి (భాన్సువాడ) :—ఈ వరకట్న నిషేధ శాసనము మన ఆంధ్రప్రదేశ్‌కు చాలా అవసరమని భావిస్తున్నాను. ఇదివరకు యీ చిత్తు చట్టము తీసుకువచ్చినప్పుడు తెలంగాణా భాగము అందులో లేదని అభిప్రాయపడినారు. కాని తెలంగాణా ప్రజాభిప్రాయంకూడ దీనికి చాలా అనుకూలంగా ఉన్నది. ఎంతో కాలం నుంచి ఇక్కడ జరిగిన ఆంధ్రమహాసభలలో, మహిళాసభలలో ఇలాంటి తీర్మానాలు చేసి పంపబడినవి. ఇది తప్పకుండా శాసనము కావాలని తెలంగాణా ప్రజల పక్షాన కోరుతున్నాను. ఈ దురాచారం ఇవ్వాళదికాదు. నిన్నటిదికాదు.

దాదాపు అర్ధశతాబ్దంనుంచి యీ దురాచారం ప్రేళ్ళు పాతుకొనిపోయింది. ఈ దురాచారంవల్ల ప్రజలకు ఆర్థికంగా జరిగిన నష్టం ఒక ఎత్తు, మానవజాతికి నైతికంగా జరిగిన అవమానం ఇంకో ఎత్తు అయి ఉన్నది. ధనవంతులు కట్నం ఇవ్వగలుగుతున్నారు. పేదవారు తల తాకట్టుపెట్టి ఎట్లాగో ఇస్తున్నారు. మన మానవజాతిలో ముఖ్యంగా ఆంధ్రులు ఎంత అడుగున దిగజారిపోయారు అన్నది చూడాలి. తమ పిల్లలకు చదువు చెప్పించుకొని, వారు ఉద్యోగంలోకి రాగానే, ఎవరో పిల్లను యిస్తామని వచ్చినప్పుడు, తమ కొడుకు ధరలు తామే కట్టుకొని "ఇంత ధనం ఇస్తేగాని మీ అమ్మాయిని చేసుకోము" అనటం మార్కెటులో ఉండేవస్తువులతో సమానంగా చూస్తున్నారనే అనుకొంటున్నాను. పూర్వము ఇది స్త్రీ జాతికే చాలా అవమానకరమని అనుకొనేవారము కాని ఇప్పుడు అదికాదని అనుకొంటున్నాము. ఇది పురుషజాతికే అవమానకరమైనదీ అనినేను అనుకొంటున్నాను. ఆడపిల్ల తల్లిదండ్రులు ఏదో కష్టపడి డబ్బుఇస్తున్నారు. కాని పురుషులు, విద్యావంతులైనవారు, చదువుకొనేవారు, గొప్పగొప్ప పదవులలోకి పోయేవారు, అన్నింటికి ముందు తమ పేర్లను వేసుకొనేవారు, తమకు ఒకరేటు నిర్ణయించుకొని "మేము ఇన్నివేలకు అమ్ముడుపోతాము, ఆ ధర మాకు ఇవ్వాలి" అని చెప్పటము చాలా విచారకరము. నేను సభామర్యాదను అతిక్రమించక పోతే, దానిని "నరమాంస విక్రయమని" అంటున్నాను. ఇది మానవజాతికే అవమాన కరమైనది. ఈ బిల్లుగురించి కొందరు సోదరసభ్యులకు ఒక అభిప్రాయము ఉన్నది. "ఈ బిల్లు pass అయినా, అమలుజరగటం కష్టము అవుతుంది; ప్రజలు చాటుమాటుగా కట్నం తీసుకొంటూనే ఉంటారు. కాబట్టి యీ బిల్లువల్ల ఏమి లాభపడతాము ?" అని కొందరు అభిప్రాయపడుతున్నారు. "మద్యనిషేధ చట్టము మొదలైన కొన్ని చట్టములు ఫేల్ అవుతున్నవి; అదే విధంగా యీ చట్టంకూడ ఫేల్ అవుతుంది" అన్నారు. కాని ఎల్ల కాలం అలా జరగదు. ఉన్నత విద్యావంతులతో కూడిన యీ శాసనసభ "వరవిక్రయం అవమానకరము, అక్రమము; న్యాయ విరుద్ధము"అని నిర్ణయముచేస్తే, తర్వాతనైనా ప్రజలు దీనిని సక్రమంగా అమలుపరచుకోగలరు. ఆ విధంగా నిర్ణయంచేయటం మన వంతు. దానిని అమలుపర్చుకోవటం, దానిని పాలించుకోవటం ప్రజల వంతు. అనేక దురాచారములు మనం శాసనాల ద్వారా మానిపించినాము. సతీసహగమన నిషేధ శాసనం, బాల్య వివాహ నిరోధ చట్టం, వితంతు వివాహములు, అస్పృశ్యతా నివారణ మొదలగు చట్టములుచేసి, ఎన్నో దురాచారములను శాసనముల ద్వారానే మానిపించినాము. మొదట్లో ప్రజలలో కొంత అలజడి కలిగినా, కొంత కాలం తర్వాత క్రమక్రమంగా ప్రజాభిప్రాయం బలపడుతుంది. అప్పుడు యీ శాసనం ప్రజలలో వ్యాప్తిపొందుతుంది. కొంతకాలం అయిన తర్వాత యీ దురాచారం మన దగ్గర ఉండేదా, అని అనిపిస్తుంది. కాబట్టి సోదరసభ్యులందరు, అన్నివర్గాల వారు యీ బిల్లును బలపరచవలసిందిగా కోరుతున్నాను. ఏవో చిన్నచిన్న విషయాల కోసం అభ్యంతరం పెట్టకుండా, చిన్నచిన్న మాటలు మార్చమని పట్టుపట్టకుండా, సాధ్యమైనంత త్వరలో యీబిల్లును ఆమోదించేటట్లుగా చేయాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ యస్. కె. వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం—జనరల్) :—అధ్యక్షా, నేను యీ బిల్లును పూర్తిగా బలపరుస్తున్నాను. ఈ బిల్లును ఆదిలో తీసుకువచ్చిన పూజ్యనీయులైన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారిని, యీ బిల్లును ప్రతిపాదించిన అమ్మన్నరాజాగారిని నేను అభినందిస్తున్నాను. చాలాకాలం నుంచి సంఘంలో పాతుకుపోయిన యీ దురాచారాన్ని నిర్మూలించేందుకు యీ బిల్లును తీసుకురావటం అత్యంత ముదావహం. పూర్వం నుంచీ, సంఘం

లో వివాహానికి సంబంధించినంతవరకు చాలా దూరాచారాలు ఉండినవి. ఇది సభ్యులందరికి తెలిసిన విషయమే. పూర్వము ఒక వ్యక్తి చాలా మంది స్త్రీలను వివాహము చేసుకోవచ్చును. ఈ దురాచారాన్ని నిర్మూలించుట కొరకు, బహు భార్యా నిషేధ చట్టము వచ్చినది. పూర్వము ఒక వ్యక్తి అనేకమంది స్త్రీలను వివాహమాడుట అన్నది ఉండేది; అది పోలగమి—ఆ దురాచారం సంఘంలోనుంచి నిర్మూలించబడింది. అటులనే ఒక స్త్రీ అనేక మంది పురుషులను వివాహం చేసుకొనే ఆచారం ఉండేది. ఆ సంగతి మనం భారతంలో చూశాము. ద్రౌపదిని ఐదుగురు పాండవులు వివాహం చేసుకోవటం జరిగింది. ఈ దురాచారము కూడ రాను రాను సంఘము నుండి పోయినది. ఇప్పుడు మానుగమీ,—ఒక భార్యను మాత్రమే స్వీకరించవలెను అను చట్టము అమలులో ఉన్నది. లోగడ, మన స్పీకరుగారు 'యాంటీ బైగమీ ప్రివెన్షన్ ఆఫ్ మ్యారేజి యాక్టు'అని ఒక ప్రయివేటు బిల్లు తీసుకువచ్చి శాసనంచేశారు. తర్వాత కేంద్రప్రభుత్వము 'హిందూమ్యారేజీలా వగైరా అన్నింటిని codification చేయటంవల్ల హిందూ మ్యారేజి ఆక్టు అని పేరే చట్టము కొత్తగా అమలులోకి వచ్చింది. అది లందరికీ తెలిసిన విషయమే. పూర్వం దీని విషయంలో కందుకూరి వీరేశలింగంగారు చాలా కృషిచేశారు. ఈ సందర్భంలో వారిని స్మరించటం చాలా అవసరము. దరిమిలా, వరవిక్రయము, కన్యాశుల్కము మొదలగు నాటక రచనలు ద్వారా సంఘంలో యీ దురాచారమునకు వ్యతిరేక ప్రచారము బాగానే జరిగింది. కాని యీ దురాచారం సంఘంలో ఇంకా పాదుకునే ఉన్నది. ఈ దురాచారం ఎంతమాత్రం తగ్గలేదు. ఇప్పుడు మనం యీ బిల్లును ప్రవేశపెట్టటం ద్వారా, యీ దురాచారం పూర్తిగా నిర్మూలింపబడు తుందని ఆశించనప్పటికీ, కనీసం, యీ కన్యాశుల్కం వరకట్నం విషయంలో ప్రజల యొక్క నిరసన Statute bookమీద పెట్టటం జరుగుతుంది. ఇప్పుడు ఉన్నది. ప్రజా ప్రభుత్వము. ప్రజాప్రభుత్వం శాసనం చేసిందీ అంటే ప్రజల యొక్క అభిప్రాయము వ్యక్తం చేయబడిందన్నమాట. వారి యొక్క నిరసన యీ కనీసం statute book మీద పెట్టటం అనేది జరుగుతుంది. ఇప్పటికి కాకపోయినా త్వరగానే ప్రజాభిప్రాయం దీనికి అనుకూలంగా వస్తుందని ఆశించవచ్చును. వరకట్నములవల్ల ఎంతోమంది ఇబ్బందులకు లోనవుతున్నారు. ఇది వరకట్నం, కన్యాశుల్కం నిషేధమునకు సంబంధించిన బిల్లు అయినా, నేడు కన్యాశుల్కం అను దురాచారము చాలవరకు తగ్గిపోయింది. ఇప్పుడు వరకట్నము అను దురాచారమే సంఘంలో ఎక్కువగా ఉన్నది.

బిల్లులో కొన్ని లోపాలు ఉన్నవి. క్లాజు బై క్లాజు చర్చవచ్చినప్పుడు, నేను కొన్ని విషయాలు చెప్పవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. దీనిని నాన్-కాగ్నిజేబుల్ చేయటంవల్ల ప్రత్యేకమైన ఇబ్బందులు చాలా వస్తాయి. కేవలం దీనికి సంబంధించిన పార్టీయే, కోర్టుకు వెళ్లి కంప్లెయింట్ దాఖలుచేసుకోవటానికి అవకాశం ఉంటుంది. కాని దానికి సంబంధించిన పార్టీవారు—కట్నం ఇచ్చినవారుగాని, పుచ్చుకొన్నవారుగాని, కోర్టుకువెళ్ళి కంప్లెయింట్ చేయటం అనేది తటస్థించదు. అందువల్ల యీ బిల్లు యొక్క ఉద్దేశము ఎంతమాత్రము సఫలం కాదని మనవిచేస్తున్నాను. దానిని కాగ్నిజేబుల్ చేసినట్లయితే; ఎవరుబడితేవారు ఎప్పుడైనా కోర్టుకువెళ్ళి కంప్లెయింట్ చేయటానికి సావకాశం ఉంటుంది. కాబట్టి ప్రతివారు తమకు సంబంధించిన విషయం కాకపోయినా, కాగ్నిజే బుల్ అఫెన్సు క్రింద కేసు పెట్టినట్లయితే, అది తప్పకుండా కాగ్నిజేబుల్ కేసు అవుతుంది. ఏ పౌరుడైనా సరే, తనకు సంబంధించకపోయినా, 'ఇది నేరము క్రింద పరిగణింపబడుతోంది' కాబట్టి దానిని కోర్టుకు తీసుకువెళ్ళే అవకాశం ఉంటుంది. అటువంటి మార్పు తప్పకుండా చేయాలి. ఇటు

వంటి శాసనంలో, తొలుతనే, కఠినంగా శిక్షలు విధించే ఏర్పాటుచేయటం అంత వాంఛనీయం కాదు. రానురాను దీనిని మార్చుకోవచ్చును. మిత్రులు, పూజ్యులు అగు శ్రీ నరసింగరావుగారు చెప్పినట్లు బాల్యవివాహ నిషేధచట్టం అమల్లోకి వచ్చినప్పుడు, ప్రజలు తహతహపడి, ఆంధ్ర ప్రాంతంనుంచి తెలంగాణా ప్రాంతమునకు వచ్చి పెళ్ళిళ్ళుచేయటం అన్నది లార్జ్ స్కేలుమీద జరిగింది. తరువాత రానురాను ప్రజలు బాల్యవివాహములలోని చెడుపు గమనించారు. ఇప్పుడు బాల్యవివాహములు జరుగుటలేదనియే మనము చెప్పవచ్చును. అదే విధంగా యీ శాసనము కూడా రానురాను సక్రమంగా అమలుజరగవచ్చును.

ఇందులోగల కొన్ని లోపాలు గురించి, "క్లాజువారీ క్లాజు చర్చ" వచ్చినపుడు మనమందరము చర్చించవలసిన అవసరము ఉన్నది. ప్రస్తుతం, యీ బిల్లు చాలా వాంఛనీయమైనదని, తప్పకుండా సభవారు ఆమోదించి వెంటనే దీనిని శాసనముగా జేయవలసిందని అర్థిస్తూ సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షా, ఈనాడు Non-Official Day గనుక సభ్యులు మాట్లాడటానికి unlimited గా time ఇస్తున్నారుగాని, కొంత limited గానే time ఇస్తే మంచిదేమోనని నా అభిప్రాయము. ఈ విధముగ unlimited గా మాట్లాడుతూ పోవడమంటే, ఎంత టైము తీసుకున్నప్పటికినీ పరవాలేదు. దీనినిబట్టి ప్రభుత్వము కూడ liberal గా ఉన్నట్లు కనబడుతున్నది. ఈ బిల్లు త్వరలో ప్యాసు చేయడము మంచిది అని అనుకుంటున్నాను. ఎందుకంటే ఈ బిల్లు సోదరులకు సంబంధించినది గనుక త్వరలో ప్యాసు చేయడము మంచిదే.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు:—గోపాల కృష్ణయ్యగారు బ్రహ్మచారండీ. ఆయనకు అందరు సోదరులే. (నవ్వు).

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—ఈ బిల్లు త్వరలో ప్యాసు చేయాలని నేను అంటూంటే, మన ప్రక్కన కూర్చున్న సోదరీమణులందరు చప్పట్లు కొట్టుతున్నారు. అందువల్ల బహుశః నేను దీనికి వ్యతిరేకించి మాట్లాడ బోతానేమోనని అనుకుని ఉంటారు.

గౌ|| సభ్యురాండ్రు:—లేదు, లేదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—శ్రీ రామకృష్ణరాజుగారు, నేను బ్రహ్మచారిని గనుక దీనితో నాకేమి పనిలేదని ఆయన అనుకుంటున్నారనుకుంటాను. అయితే నాకు దీనితో చాలా అవసరమేమో నాకు తెలియదు. కాని సభ్యులు భయపడకుండ ఉండటానికి నేను చెబుతున్నాను. ఈ బిల్లు రెండు తరగతులవారికి సంబంధించినదిగా ఉన్నది. మగ పిల్లలుగలవారికి, ఆడపిల్లలుగల వారికి కూడ ఇది వర్తిస్తుంది. మగపిల్లలు, ఆడపిల్లలు ఉన్నప్పుడు, ఆడపిల్ల పెళ్ళి ముందుకావలసి వుంటే ఈ బిల్లును support చేస్తాడు. కాని మగపిల్లవాడి పెళ్ళి ముందుకావలసివుంటే, ఆడపిల్లల పెళ్ళిళ్ళు అదివరకే అయిపోయివుంటే, దీన్ని ఎంతమాత్రము support చేయరు. తన పిల్లవాడికి వచ్చేడబ్బు కొస్తపోతుందేమోననే భయము ఉంటుంది. అందువల్ల ప్రతివాడికి ఈ బిల్లు మీదనే రెండు అభిప్రాయములు ఉండడము మన సాంఘిక వ్యవస్థలో ఉన్న దురాచార ఫలితము అని చెప్పక తప్పదు. మనము ఈనాడు కాకపోయినను, ఇంకొక నాటికైనా దీన్ని తొలగించవలసిందే. అయితే ఈ బిల్లు తెచ్చేటప్పుడు కట్నము తీసుకోవడము prohibitoryగా

తీసుకునివస్తే ప్రజలకు సాంఘికంగా ప్రయోజనము ఉంటుందా, లేదా అనేది చాలా మందికి అనుమానముగా ఉన్నది. నేను కూడ అదేవిధముంగ అనుమానించే వాళ్లలో ఒకడినే. కాని అలాంటి అనుమానమువల్ల ఆ కర్తవ్యము నెరవేరదు. కాని ఈబిల్లు శాసనము అయితే, ఇది కొంత social evil తో ఉంటుందనే శాసన కర్తలు అందరు సమాజముతో సహా ఒప్పుకోవడమ్ము జరిగింది. అవుతుంది. కాని ఈ కట్నము తీసుకునే పద్ధతి నిషేధించక తప్పదు, అనిచెప్పి సంఘము ఒక నిర్ణయానికి వచ్చింది. అసలు దీన్ని అమలు జరపడములో ప్రజా జీవితములో మార్పులు వచ్చినప్పుడు, ప్రజలలో అన్నింటికంటె ముఖ్యంగా ఉత్సాహము వచ్చినప్పుడు ఏనాటికైనా యువకులలో నూతన చైతన్యము వచ్చినప్పుడు ఇది నిషేధించడం జరిగి తీరుతుంది. నేను అప్పుడప్పుడు విద్యార్థి సమావేశాలకు వెళ్లుతూ ఉంటాను. ఆ సమయములో నేను ఈ విషయాన్ని గురించి చాలాసార్లు చెప్పాను కూడ. సభ్యులందరు ఒక్క విషయము మాత్రము గుర్తించాలి. యువకులు వ్యక్తిత్వము గలవారు అవునాకాదా చెప్పండి. అవును అంటారా, అప్పుడు మన కాళేశ్వరరావు పంతులుగారి వద్దకు వెళ్లి ఈబిల్లును మీరు ఉపసంహరించుకొండి, మేము ఎవ్వరము కూడ కట్నము తీసుకోము అని మా సంఘాల ద్వారా ప్రచారము చేస్తాము. ఎవరైనా తీసుకుంటే తీసుకున్నవాడి ఇంటివద్ద సత్యాగ్రహమో, మరేదో చేస్తాము. అప్పుడు తప్పకుండ ఈ బిల్లు యొక్క ఆశయము నెరవేర్చ గలుగుతాము అని చెప్పినప్పుడే ప్రతివాడికి వ్యక్తిత్వము ఉన్నదనేది కన్పిస్తుంది అని చెప్పవచ్చు. వ్యక్తిత్వము ఎప్పుడైతే కన్పించదో అప్పుడు ప్రభుత్వము కొద్దిగ చురకవేయవలసి వస్తుంది. అందుకే ఈబిల్లు యొక్కఅవసరము ఏర్పడుతున్నది. కాబట్టి ఈ బిల్లును తీసుకుని రావటానికి ఏలాంటి అభ్యంతరములేదు. Prohibitory legislation అమలు జరిగేటట్లు చేయడంలో చాలా కష్టములు ఉన్నవి. కాని నాకు మాత్రము ఒక్కటే భయము ఉన్నది. ఇది నిజముగ ఎవరి మీదనైతే ప్రయోగింపబడుతుందో అప్పుడు ప్రతివాడికి సానుభూతి అనేది కలుగుతుంది. ఆడపిల్లలు గలవారు డబ్బు ఏదోవిధముగ కష పడి డబ్బుతెచ్చి ఇస్తారు. పిల్లను చేసుకుంటారు' బహిరంగముగ కూడ ఇస్తారు. తరువాత జరిగే పరిణామము ఏమిటంటే, ఎవరో ఒకరు' విరోధి అయినవాడు ఈ విషయాన్ని గురించి కేసుపెట్టుతాడు. తీరా, సాక్ష్యముదగ్గరకు వచ్చేటప్పటికి ఆ పిల్లతండ్రి పెళ్ళి బ్రతిమాలుకుంటాడు. ఏమండి! మా అమ్మాయి పెళ్ళి అయిపోయింది గదా! అయిపోయిన పెళ్ళికి ఇంకా ఇబ్బందులు ఎందుకు తెస్తారు, అని అంటాడు. ఇక పెళ్ళికొడుకు తండ్రికూడ ఇంకొక వైపున ఇదేమాదిరి బ్రతిమలాడు కుంటాడు. మాకు కోర్టు చుట్టూ తిరగడము పెట్టకండి ఏదో పెళ్ళిఅయిపోయిందిగదా, వదలిపెట్టండి అని అడుగు కుంటారు. అప్పుడు ఎట్లాగైనా సానుభూతి అనేది కలుగుతుంది. కాని అక్కడే మానవజాతికి ఉండే నిజాయితీ బైటపడుతుంది. సాక్ష్యము అవసరము ఉన్నది; చెబుతామా వద్దా అని తేల్చుకునేటప్పటికి అయిపోయినదానికి ఎందుకులే అని ఊరకుంటాడు కాబట్టి దీని పర్యవసానము ఏమయిందో చూడండి. ఇది అమలు జరిగేదికాదని తెలుస్తున్నది. అయితే దీన్ని cognizable offence క్రిందకు వచ్చేటట్లుగా చేయడమా, లేక non-cognizable గా చేయడమా అనేది ఒక సమస్య ఇప్పుడు మనముందు ఉన్నది. నా అభిప్రాయములో దీన్ని cognizable offence క్రిందకు తీసుకుని రావడమే మంచిదని అనుకుంటాను. కాని ఇందులో ఉన్న ప్రమాదము ఏమిటంటే, ఈ రోజునవున్న ప్రభుత్వ విధానములో అధికార్లలో encouragement చాలా జాస్తిగా ఉన్నది. వారి యొక్క భయము తప్పు చేసినవారిని

పట్టుకోటానికి ప్రయత్నిస్తే, వారి చేతకాదు. కాని నిజంగా తప్పు చేయనివారిని ఏదో కారణముల చూపించి పట్టుకోవడము జరుగుతుంది. పలుకుబడి ఉన్నవారు అయితే వారు పట్టుబడరు. కాబట్టి ఈ విషయములో ముందు సంఘములో మార్పులు తేవటానికి కృషిచేయాలి. ఇది సంఘములోవున్న వ్యక్తుల మర్యాదవల్లకాదు, నిజాయితీ వల్లకాదు, పరివర్తన వల్లకాదు, వారి యొక్క character వల్లకాదు. సంఘములో ఉన్న ధనమువల్లనో లేకపోతే కులము వల్లనో ఆ గ్రామములో పలుకుబడిగలవారి దబాయింపువల్లనో, ఇది జరగవలసిందేగాని ఈ శాసనము అక్కడ ఏమీపని చేయదు. కాని గ్రామాలలో పేదవాడుగాను, పలుకుబడి లేనివాడుగాను ఉండి తాను పిల్లపెళ్ళి చేయటానికి డబ్బులేక బాధపడుతూ, మర్యాదకు భయపడి, తనకువున్న ఏ ఇల్లో అమ్ముకునో, అప్పో సొప్పోచేసి, ఇక ఈ పిల్లను తన ఇంట్లో ఎన్నాళ్ళు ఉంచుకోవడము అని ఆలోచించి, లజ్జతో, ఏదో విధముగ పెళ్ళిచేస్తే, ఇక అతని నెత్తిన కేసుపెట్టటానికి ప్రక్కన ఉన్న విరోధి బయలుదేరి Sub-Inspector వద్దకు వెళ్లుతాడు. మన శ్రీరంగ నాధ మొదలియార్‌గారికి ఒక అనుమానము వచ్చింది. ఏమిటంటే, గోపాల కృష్ణయ్యగారు దీన్ని బలపరుస్తాడా, వ్యతిరేకిస్తాడా అని. ఇదుగో నేను దీన్ని బలపరుస్తున్నాను. ఏదిచేసినా ఒక్కటేనని కల్లూరు సుబ్బారావుగారు అంటున్నారు. అయినా నేను అంత indifferent కాదు. కాని నాకు మాత్రము ఇలాంటి బిల్లులు ఉండాలనే అభిప్రాయము ఉన్నది. కాని ఇందులోవున్న చిక్కులు, ప్యాసుచేస్తే వచ్చేచిక్కులు అన్నీ ముందుగానే ఊహించుకొనకపోతే, ఇది చివరకు ఎవరినో ఒకరిని బాధపెట్టకమానదు. తరువాత వస్తాయించుకునేబదులు, దీన్ని సభ్యులందరు క్షుణ్ణముగా విచారించి ఎవ్వరిని ఏవిధముగాను బాధపెట్టేదిగాకుండా, ప్రయోజన కారిగా చేయాలని నా అభిప్రాయము. ఇక్కడ మనము ఏ ఆశయముతోనైతే చేయదలచు కొన్నామో, ఆ ఆశయసిద్ధికి, దీనిని శాసనము చేయడమేకాకుండా, మన మందరము బైటకు పోయి ఏరూపములోనైతే కావలసిన ప్రజాభిప్రాయము మనము సేకరించవలసి ఉంటుందో అది ఆలోచించాలని అంటున్నాను. ఇప్పుడు ఏదో శాసనము చేసివేశాము, అని అంతటితో ఊర కుంటేకాదు. ప్రజలకు కూడ దీని యొక్క ఆశయము, ప్రయోజనములు బోధించవలసి ఉంటుంది. ఏప్పైనప్పటికినీ, ఇప్పుడు ఈ బిల్లులోని కొన్ని వాక్యములనుబట్టి చాలా చిక్కులు ఉండేటట్లుగా కన్పిస్తున్నది. ఇదివరకు draft చేసిన బిల్లుకున్నూ, దీనికిన్నీ చాలా తేడాలు కనబడు తున్నవి. ఆబిల్లు; ఇదీ, ఈ రెండుకూడ సమన్వయపరచి చేయటానికి ఇక్కడ మనకు లాయర్లు సభ్యులు కూడ చాలామంది ఉన్నారు. కాని వారు దీని విషయములో ఏమిశ్రద్ధ తీసుకున్నట్లు కన్పించదు. అవి అన్నీ ఆలోచించకుండా, పరిశీలించకుండానే ఈ రోజున మన ముందుకు వచ్చింది. ఈ శాసనసభ చేసిన చట్టముల విషయములో హైకోర్టువారు శాసన సభ్యులనుగాని, శాసన సభనుగాని ఏమి వ్యాఖ్యానించడములేదుగాని ప్యాసుచేసిన బిల్లులలోవున్న పరిభాషమాత్రమే చాలా lose గా ఉన్నదని remark చేశారు. కాబట్టి ఈ బిల్లులోని భాష కూడ మరొక పర్యాయము పరిశీలించడము మంచిది. ఇది ఎవరికి అన్వయిస్తుందో నాకు తెలియదు వారు contempt క్రిందకు రారుకాని, వారితో మాట్లాడితే మేము గ్రామర్ మీద మాట్లాడాము, లేకపోతే idiomatic language మీద మాట్లాడాము, అని అంటారు. కాని వారి legal aspect చూస్తారుకాని, మనముచేసే ప్రతి బిల్లు విషయములో కూడ అది ఎంత ఖచ్చితముగా ఉండాలో చూడాలి. అంతేకాని wordingలో సీధో రబ్బరుమాదిరి ఎటువడితే అటు తిరిగేటట్లుగా language ను ఉపయోగించటానికి

వీలుకాదు, మంచిదికాదు. అన్ని విధముల రక్షణ ఇచ్చేటట్లుగా ఉండాలి. ఈ నాడు ప్రధానముగ కొన్ని amendments కొంతమంది సభ్యులు sponsor చేశారు. వారు కూడ మరల ఆలోచిస్తే మంచిది. ఈ బిల్లు మనము ఇప్పుడు ప్యాసుచేస్తే కొంతమందికి కష్టముగా ఉంటున్నది. ఈ బిల్లు విషయములో ప్రభుత్వమువారు నెత్తిన వేసుకుని బాధ్యతతో తెచ్చిన బిల్లుకాదు. ఇది non-official తయారు చేసినబిల్లు; మాకు మాత్రం ఈబిల్లు విషయములో జవాబుదారీలేదని ప్రభుత్వంవారు అనవచ్చు. అనధికార బిల్లు గనుక బాధ్యత ఎవరికి ఉన్నదంటే, దీన్ని శాసనముచేసే ప్రతి ఒక్కరిమీద ఉన్నది. అందువల్ల ఇక్కడ ఉండే లాయరు సభ్యులను నేను కోరేది ఏమిటంటే, ఆరోజున ఇది సెలెక్టు కమిటీలో చర్చించబడేటప్పుడు ఏమి జరిగిందోకాని లాయరు సభ్యులు అందరు ఈ బిల్లును మరొకసారి చూచి, ఇంకా ఏవైనా మార్పులుకాని, amendments కాని అవసరమువుంటే, అది language లో వస్తుందేమోగాని, spirit లో మాత్రమురాదు. కావలసిన మార్పులు ఏవైనావుంటే, చేయవలసినదిగా కోరుతున్నాను.

ప్రారంభంలో ఈ బిల్లును తీసుకునివచ్చినట్టి శ్రీ కాళేశ్వరరావు పంతులుగారిని నేను అభినందించవలసిన అవసరంవుంది. వారు సాంఘిక సేవలో చాలా ఉదారంగా వ్యవహరించినట్టి మనుష్యులలో ప్రథములు. 1906 వ సంవత్సరమప్పుడే హరిజన ఉద్యమంలో—అప్పుడు హరిజనులనే పేరులేదు, అస్పృశ్యులనేవారు—ఉత్సాహంతో పనిచేశారు. అస్పృశ్యత అనేపేరు చెబితేనే మండిపోయే మనిషి ఆయన. ఆయన ఇంట్లో హరిజనులను తీసుకునిపోయి భోజనంపెట్టి చదువు చెప్పించడానికి ప్రయత్నంచేసి చాలా ఉదారంగా వ్యవహరించినట్టి మనిషి. అప్పటినుంచీ సాంఘిక ఉద్యమాలలో అమితోత్సాహంతో పనిచేశారు. వారే విడాకుల చట్టాన్ని తేవడానికి ప్రయత్నించారు; బహుభార్యా నిషేధచట్టం తీసుకువచ్చారు కాని నేను మనవిచేసేది ఒకటుంది. ఆ చేసేది ఖచ్చితంగా అమలుజరిపే పరిస్థితిలో లేకుండా వెనుకనుంచీ వచ్చే చిక్కులను కూడా మనం పరిష్కరించే ప్రయత్నం చేయకపోతే ఈ బిల్లు తెచ్చినంతమాత్రాన సరిపోదు. దానికి కావలసిన ఉద్యమాలురావాలి, దానికి కావలసిన సంస్కరణలు తీసుకురావాలి. అట్లా తీసుకువచ్చే ప్రయత్నం కూడా చేసినప్పుడే ప్రయోజనం అవుతుందని చెబుతున్నాను. ఈ విషయంలో మహిళలకు కూడా చాలా బాధ్యతవుందని చెబుతున్నాను. ఎందువల్లనంటే ఎవరయితే వరకట్న నిషేధాన్ని కోరుతున్నారో ఆ మహిళలే రేపు తమ మగబిడ్డల పెండిండ్ల ప్రశ్న వచ్చినప్పుడు, "ఏమనుకున్నారు? మా అబ్బాయి ఎంతో చదువుకున్నాడు. మేము అయిదువేల రూపాయలు ఖర్చుచేశాము" అంటే అదీ పెట్టుబడి అన్నారని నేను అనను. కాని ఆ పెట్టుబడి ఏమయిపోయిందని వీరు ఆలోచిస్తున్నారు? అది రాబట్టుకోడానికి ఆస్తివున్నవారికోసమై దృష్టి ప్రసరిస్తున్నారు. ఈ సందర్భంలో స్నేహలతా సమాజంవారిని చాలా అభినందించవలసివుంది. వారు పెళ్ళి ప్రచారంచేసి ఇట్లాంటి ఆదర్శ వివాహాలు ఎక్కడ చేసుకోడానికి వీలవుతుందో చూచి యువకులను యువతులను చేర్చి ప్రోత్సాహపరచి నిరంతరంగా వివాహాలుచేసి ఒక missionగా పనిచేస్తున్నారు. అట్లాంటి campaign నడచినప్పుడే జరుగుతుంది. లేకపోతే ఈ బిల్లుతెచ్చి పూర్తిచేస్తే, పూర్తిచేసిన వాళ్ళము మాత్రమే అవుతాము; సరిపోతుంది; అంతకన్నా ఏమీలేదు. నేడు శ్రీమతి అమ్మన్న రాజాగారు బిల్లును ప్రతిపాదించడమేకాకుండా ఆంధ్ర దేశములోనికి వెళ్ళి సంఘంలోవున్న పరిస్థితులలో "ఇదిగో ఇక్కడ ఇట్లా వుంది. నేను

ఏ ప్రయత్నమైనాచేసి నాబలంఅంతా ఉపయోగపరచి దీనిని అరికడతాను" అని చెప్పేటటువంటి ప్రయత్నం ఆమె చేసినప్పుడే ఈ బిల్లు ఉపయోగపడుతుందని చెబుతున్నాను. ఈ పూట ఈ బిల్లు ప్రతిపాదన శ్రీ కాళేశ్వరరావుగారి absense లో జరిగింది. వారికి ఆ గౌరవం ఇవ్వడం నాకు చాలా సంతోషంగావుంది. కాని దానిమీద మహిళా సమాజాలవారు ఏమిచేస్తారని అడుగుతున్నాను. మహిళా ఉద్యమం నేడు బలవత్తరంగా ఉన్నట్లయితే ఈ బిల్లు ఇంతబలహీనంగా ఉండేదికాదు. నేను ఈ బిల్లును బలపరుస్తున్నాను. దీంట్లో పొరపాట్లు దిద్దవలసిన అవసరంవుంది. దీనిలో ' out of consideration' డబ్బుయిస్తే ఫరవా లేదనివుంది. "పెళ్ళిలో మూడువందలో, రెండు వందలో ఏమి ఇచ్చినప్పటికి కూడా" అంటే ఉద్దేశ్యపూర్వకంగా మంచిదేకాని words లో పొరపాటు వచ్చినట్లయితే దానిని సంఘ వ్యతిరేకులు ఉపయోగపరచుకోడానికి ప్రయత్నం చేస్తారు. శాసన రూపంలో వాళ్ళ చేతులు విరుగకొట్టవలసిన అవసరంవుంది. వారు ఏమి చేస్తారంటే, "ఇదిగో నాకు వ్యతిరేకి ఉన్నాడు. కాని ఇంట్లో 200 రూపాయలు ఇచ్చాడు" అని నలుగు రైదుగురు సాక్షులను తీసుకునివచ్చి "ఇదిగోనయ్యా వాళ్లు డబ్బిచ్చారు. ఇదీ నేరం అయినది" అని నేరం మోప వచ్చును. నాకు మా ఊళ్లో జరిగిన ఒక సంఘటన జ్ఞాపకం వస్తున్నది. మా ఊళ్లో మురికివస్తే ఆ మురికి కాలువను బాగుచేశారు. కాని ఎప్పుడో ఆ కాలువ బాగులేదని 15 మందిని సాక్షులను తీసుకువచ్చి case పెడితే చివరకు Health Inspector వచ్చి "నేను చూశానండి ఆ కాలువను మరునాడే బాగుచేశారండి, అందుచేత case లేదండి" అని చెప్పేవరకు రక్షణలేక పోయింది. అందువల్ల ఈ చట్టంలోని లోపాలను స్వార్థంకోసం ఉపయోగ పరచుకోకుండా చూడవలసిన అవసరంవుంది. మొదట expression సరిగానేవుంది. అది ఎందువల్ల మార్పుచేశారో నాకు అర్థంకావడంలేదు. ఇది ఒక మతానికి, కులానికి ఉద్దేశించినదేకాదు. మనం నేడు Secular State లో వున్నాం. అందుచేత ఒక సమాజానికి, ఒక కులానికి, ఒక మతానికి అవధులుగాని అవరోధాలుగాని కల్పించడం సరిఅయినది కాదని నా అభిప్రాయం. ఏదయితే dowry అని నిషేధిస్తున్నామో అది నిషేధింపబడవలసినదే. గాని దాంట్లో అనేక సమస్యలు వస్తాయి. ఇది religious function అవునాకాదా అని కొందరంటారు. నేడు హిందూ సమాజంలోని పెండ్లిండ్లలో ఒక ఆచారంవుంది. పిల్లనిచ్చినవారు కోటీశ్వరులైనాసరే వారు తమ అమ్మాయిని లక్ష రూపాయలతోటి పిల్లవానికిచ్చినా సరే చివరకు మగపెళ్ళివారు పెళ్ళినుంచి వెళ్ళేరోజున తల్లికి ఆ బిడ్డను కొనుక్కుంటున్నట్లు, "ఈ సమస్యకు సంబంధించినటువంటి డబ్బు" అనే పేరుతో ఒక రూపాయి తాంబూలం ఇచ్చిపోతారు. అందువల్ల అది ఏమవుతుంది? కన్యా శుల్కం అవుతుంది. కాని కన్యాశుల్కం తీసుకోకుండా పోయినట్లయితే "కాదమ్మా అది మాత్ర సంబంధం అయినటువంటిది, ఇవ్వకపోతే వీలులేదు" అని పురోహితుడు తయారై కూర్చుంటాడు. ఆ తరువాత అందరూ కలిసి "మీరు తీసుకోవాలి" అంటే sentiment, తల్లిని ఎంతబాధ పెడుతుందో నాకు తెలుసును. రెండు, మూడు వివాహాలలో నేను పోయి కూర్చున్నప్పుడు రెండు సందర్భాలలోనూ ఇటువంటి ఘటన లున్నాయి. ఒకటి తల్లికి ఇష్టంలేకుండావుంటే "ఇది సమాజానికి సంబంధించినది, మీరు తీసుకుని తీరాలి. ఇది religious function. Dowry క్రింద మీరు తీసుకోవద్దు; ఇది మతానికి సంబంధించినది; కులానికి సంబంధించినది; గౌరవానికి సంబంధించినది; మంత్రాలకు సంబంధించినది; మీరు రూపాయి దక్షిణ తాంబూలం తీసుకోవాలి" అని

ఒక చెంప అంటున్నారు. అది నిషేధించాలి; తప్పదు. ఇక్కడ sentiment ఉండడానికి వీలులేదు. అంత ఆప్యాయతగాచేసిన తల్లినే రక్షించలేకపోతే ఈ బిల్లువలన ప్రయోజనం ఏమిటి? Religious function వుంది. ఎవరు ఏదేవుడిని కావాలని కోరితే ఆదేవుడిని సేవించుకోవచ్చు; పూజించుకోవచ్చు; అభ్యంతరంలేదు. కాని దైనందిన జీవితంలో మతం పేరుతోవున్న customary rights ను నిర్ణయించదలచినట్లయితే అట్టి నిర్ణయానికి నేను పూర్తిగా వ్యతిరేకినని చెబుతున్నాను. అదేవిధంగా పెండ్లిండ్లలో నేను బాధపడేది ఇంకోసంఘటన చెబుతున్నాను. పిల్లను ఇస్తారు. వెళ్ళిపోయేటప్పుడు అప్పగింతలు చెబుతారు. అప్పుడు మాత్రం తల్లిదండ్రులు ఏడ్చేదానికన్న ప్రక్కనున్నవారే ఎక్కువగా ఏడుస్తారు. వారు sentiment తోటే ఏడుస్తారు. ప్రక్కనున్నవారు ఎందుకు ఏడుస్తారంటే "నేను ఈ బిడ్డను నీకు దాసీగా ఇస్తున్నాను" అని చెబుతాడు కనుక, సభవారికి ఆ మంత్రం జ్ఞాపకంవుంటేతెలుస్తుంది. నిజముగా దాసీగా ఇచ్చాడా అని ఒకరోజంతా ఏడ్చాను. ఆ అమ్మాయి దాసీయా? ఎవరికి దాసి?

శ్రీమతి వై. సీతాకుమారి:—అధ్యక్షా, ఆ మంత్రంలో ఆమాట లేదండి. పండితులన్న విచారించాను. 'తవదాస్వామి' అంటే 'నేను నీకు ఇస్తున్నాను అనే అర్థంకాని ఇంకోటికాదు. ఆ 'స' మెలిక 'శ'కాదు కుంటి 'స'.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అది మెలిక 'శ' అవునో కుంటి 'స' అవునో నాకు తెలియదు. కాని "తవదాస్వామి" అని వుంది. దాని అన్వయం ఇద్దరు, ముగ్గురు సంస్కృత పండితులను అడిగాను, "మొట్టమొదట దాసీగానే ఒప్పుకోవాలయ్యా" అన్నారు. శ్రీమతి సీతాకుమారిగారు కూడా పండితులను కనుక్కొన్నామన్నారు. మెలిక 'శ' సంగతి చెప్పారు శాస్త్రి అన్వయాలు ఎట్లావుంటాయో మీకందరకు తెలిసినదే. "ఇదం సీత" అంటే దానిమీద వ్యాఖ్యానం 60 పుస్తకాలు వ్రాశారు. ఏ అన్వయం వచ్చినా "దాసీ" అనేమాట మాత్రం తప్పడంలేదు. 'దాసీగా బిడ్డను ఇస్తున్నాం' అనే పరిస్థితి ఎట్లా సహించడానికి వీలులేదో అట్లాగే పవిత్రత పేరుతో మత దురాచారాలను కొనసాగించడానికి వీలులేదు. మతం పేరుతో అట్లాంటి పనులు ఎవరు చేసినప్పటికీ అంగీకరించడానికి వీలులేదు; కనుక ఆభాగం మినహాయించ వలసిన అవసరం ఉందని గట్టిగా చెబుతున్నాను. తరువాత దానిని అమలు జరిపే విషయంలో ప్రభుత్వ సహకారం పూర్తిగా ఉంటుందనుకుంటాను. ఇది ప్రభుత్వ సహకారంతోటే మాత్రమే చేసేదికాదు. అసలు మన సహకారం కావాలి. సాంఘిక సహకారం కావాలి. సాంఘిక చైతన్యం రావాలి, సంఘంలో మార్పులు రావాలి. Sarada Act వచ్చిందంటే అది చాలమంది శాస్త్రిజ్ఞులు, "మీ అమ్మాయిని ఏడేండ్లు వచ్చేముందు పెండ్లిచేయకుండా ఇంట్లో ఉంచుకున్నట్లయితే నిన్ను మహారణ్యంలో పారేయాలి" అని పెట్టేభయాన్ని తీర్చడానికి పనికి వచ్చింది. హాయిగా ఆడపిల్లలకు చదువు చెప్పిస్తున్నారు. కాని కొంతమంది తల్లిదండ్రులు "మా అమ్మాయికి ౩ సంవత్సరాలలోగా పెండ్లి చేయకపోతే కొంపమునిగి పోతుంది" అని బాధపడి పెండ్లి చేసేవాళ్ళను మనం ఏమీ చేయలేక పోతున్నాం. అందువల్ల దానికి కావలసిన social consciousness ను develop చేయాలని అర్థం అవుతుంది. దానికి ప్రయత్నం చేయవలసిన అవసరంవుంది. ఈ బిల్లు ఎందుకు పనికివస్తుందని

అడిగితే వరకట్నాన్ని నిషేధిస్తున్నది. అని చెప్పడానికి పనికి వస్తుందిగాని మొత్తం నిషేధించి అందరినీ జైలులో పెట్టి హడావిడి చేసినట్లయితే social evil ను తొలగించకపోగా "మరో evil, executive evilగాని, legislative evil గాని వచ్చిందిరా' అని మనం అనుకునే స్థితి వస్తుంది. కనుక దీనికి కావలసిన మహత్తర ఉద్యమాన్ని నడిపి విద్యార్థులలో ఉత్సాహాన్ని కల్పించి తల్లిదండ్రులలో ఆవేశాన్ని కల్పించాలి. "మన అల్లుడు బాగా చదువుకొని ఉండాలి. మన అమ్మాయిని ఊరికనే పెండ్లి చేసుకోవాలి. మన అబ్బాయికి ఆస్తిరావాలి" అని స్త్రీలు అనుకొంటే ఈ contradiction ఎట్లా అవుతుంది? ఈ contradiction ను మనం వ్యతిరేకించే శక్తిని సమాజంలో కల్పించాలి ఎవరైతే social revolution కావాలంటున్నారో, ఎవరైతే సాంఘికాభివృద్ధి కావాలంటున్నారో, ఎవరైతే సంఘ సంస్కరణ కావాలంటున్నారో వారందరూ నిరంతరం ప్రచారం చేయాలి. ప్రచారం యొక్క ఫలితం నాకు తెలుసును....

చెవులు చిల్లులు పడేటట్లు ప్రచారము చేస్తే, వారికి కొద్దిగా వినిపించినట్లు వుంటుంది. ఈ సంఘములో చైతన్యము తీసుకు రావలసిన అవసరము వున్నది. ఈ సమాజములో మార్పులు తీసుకురావాలి. ఇప్పటికే కొన్ని మార్పులు వచ్చినవి. వితంతు వివాహమును నిషేధించిన రోజులున్నవి. వారి ఇండ్లకు పోకూడదు అని నిషేధించిన రోజులు వున్నవి. ఇప్పుడు అటువంటివి అన్నీ పోయినవి. వీటిని అభ్యంతర పెట్టువారు సంఘములో అరుదయినారు. సంఘ వ్యతిరేకులు ఇతరులపై నేరములను మోపుటకు దీనిని ఉపయోగించుకొందురు. అటువంటివి చేయకుండా వుండేటట్లుగా కొన్ని క్లాజులను చేర్చి గాని, మార్చిగాని ఈ బిల్లును తీసుకురావాలి. దీనిలో వున్న defects చెప్పటము నాకు సాధ్యము కాదు కాని నాకు వున్న భావములు మాత్రమే చెప్పగలను. ఈ బిల్లు కోర్టులో ఏ పార్టీపైపు త్రిప్పుతే ఆ పార్టీవారికే వర్తించేటట్లుగా వుండకూడదు. సమగ్రంగా క్షుణ్ణంగా, ప్రజాబలముతో దీనిని పరిశీలించాలని చెబుతూ సెలవు తీసుకుంటున్నాను.

Srimati Shahjehan Begum (Shadnagar) (شادنگر) شریمتی شاہ جہاں بیگم *
جناب اسپیکر صاحب - میں آج تہ دل سے شریمتی امبا راجا کو مبارکباد دیتی ہوں کہ انہوں نے اس بل کو یہاں لایا ہے جس کا تعلق اون معصوم ہستیوں سے ہے جو بیچاری مجبور ہیں - اگر یہ الفاظ ان پارلیمنٹری نہ ہوں تو میں یہ سخت الفاظ استعمال کرونگی کہ انہوں نے اس بل کو لا کر لڑکیوں کو مردوں کے لالچی شکنجے سے بچانے کی کوشش کی ہے - بل بہت اچھا ہے - انہیں ہزاروں لڑکیوں کی دعائیں ملیں گی - حال ہی میں بمبئی میں ایک لڑکی نے محض اس وجہ سے خودکشی کرلی کہ اوس کے ماں باپ جہیز نہیں دے سکتے تھے - میں سمجھتی ہوں کہ جہیز کا رواج یہاں اوس وقت پڑا ہوگا جب کہ ہندوستان میں لڑکیوں کو کوئی حقوق نہیں دیئے جاتے تھے - اپنے ماں باپ کی جائیداد میں وہ کسی قسم کا حق نہیں لے سکتی تھیں - ماں باپ اپنی بیٹی کی محبت میں اپنے لڑکوں کے حق میں سے کچھ بچا کر اپنی لڑکیوں کو دیا کرتے تھے - اس طرح آہستہ آہستہ یہاں جہیز کا رواج پڑ گیا - مجھے افسوس کے ساتھ کہنا پڑتا ہے کہ ہمارے مرد بھائی جہیز کے لئے اپنے آپ کو ہراج کرتے ہیں - وہ یہ دیکھتے ہیں کہ کتنا جہیز ملتا ہے - فرض کیجئے کہ میں ٥ ہزار روپیہ دینے کے لئے راضی ہوں لیکن اگر کوئی دوسرا شخص

دس هزار دیا ھے تو وہ دوسری لڑکی سے سادی کرنے کے لئے تیار ھوجاتے ھیں - مبں نو جہیز کو سوائے هراج یا آکسن کے کچھ اور نام نہیں دے سکی- یہ بڑی خوشی کی بات ھے کہ آج ھماری ایک بہن نے اس بل کو لاکر معصوم اور بے چاری لڑکیوں کو جہیز کی مصیبت سے نجات دلانے کی کوشس کی ھے - میری سمجھ میں نہیں آیا کہ مسلمانوں میں یہ جہیز کا رواج کیسے تڑگیا - اون کے پاس تو لڑکیوں کو برابر حق ملتا ھے - اگرچیکہ اوتنا نہیں ملتا جتنا کہ لڑکوں کو ملتا ھے - لیکن اون کا حصہ اور خاوند کا حصہ دونوں ملاکر برابر ھوجاتے ھیں - میرا خیال ھے کہ مسلمانوں میں یہ رواج دوسروں کی دیکھا دیکھی لالچ کے تحت تڑگیا ھے - میری دو بیٹیاں ھیں لیکن میں نے اون کی شادی کے سلسلہ میں یہ شرط لگادی ھے کہ جو شخص جہیز مانگے گا وہ میرے دروازہ پر نہ آئے - میرے ۱ لڑکے ھیں لیکن میں ایک پائی بھی جہیز نہیں لوں گی - اس وقت جو امنڈمنٹ ڈاوری یا مہر کے سلسلہ میں ........

مسٹر ڈپٹی اسپیکر - جس وقت امنڈمنٹ پیش ھوگا اوس وقت بحث کیجئیے -

شریمتی شاہ جہاں بیگم - تو میں نہیں سمجھتی کہ اس سلسلہ میں میں مزید کچھ اور کہہ سکتی ھوں - یہ بل اتنا اچھا اور اتنا بہتر ھے کہ میرے پاس اوس کی تعریف کے لئے الفاظ نہیں ھیں - اس بل کی وجہ سے لاکھوں لڑکیوں کی دعائیں ملیں گی اور اسمبلی کو وہ خیر سے یاد کریں گی -

శ్రీ కె. సుబ్బారావు :—ఉపాధ్యక్షా, ఆంధ్రరాష్ట్ర ఎసెంబ్లీలో శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారిచే ప్రతిపాదింపబడిన ఈ బిల్లు ఈ దినమున ఆంధ్రప్రదేశ్ ఎసెంబ్లీలో శ్రీమతి అమ్మన్నరాజ గారిచే ప్రతిపాదింపబడినది. వారి బిల్లు వరకట్నము, కన్యాశుల్కము, ఈ రెండింటికి సంబంధించినదని మొదట చెప్పబడినది. కాని ఇది వరకట్నమునకు సంబంధించిన బిల్లు అని ప్రజలలో ప్రతీతి గాంచినది. తల్లిగాని, తండ్రిగాని మేనమామగాని, ఎవరైనా ఏ పేళ్లలోగాని ఏదైనా డబ్బు తీసుకుంటే అదంతా దీనిక్రిందే వస్తుందని భావము ఈ బిల్లులో వుంది. శ్రీ కాళేశ్వరరావుగారు సాంఘిక సేవాపరాయణులు, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు బ్రహ్మచార్యులు. ఇప్పుడు ఈ బిల్లు అమ్మన్నరాజాగారి చేతికి వచ్చింది. మొదట మాట్లాడిన లక్ష్మణదాసుగారు. వీరిలో ఎవరికి బిడ్డలు వున్నట్లులేదు. బిడ్డలు కలిగి కష్ట సుఖాలు తెలిసినవారు ఈ బిల్లు పెట్టి వుంటే చాలా సంతోషముగా వుండేది. ఈ వరకట్నమనేది సంఘములో ఒక దురాచారమే. "సత్యం వద" "ధర్మం చర" అని వ్రాసిన వారే ఈ విధముగా డబ్బు తీసికోవటం తప్పు అని వ్రాసినారు. కాని కాలానుగుణ్యముగా ఆ సత్యాన్ని వధచేశారు. ధర్మాన్ని జర చేశారు. దేశకాల వ్యవహారముల ననుసరించి అనేక రకాలైన ఆచారాలు వచ్చినవి. ప్రజాభిప్రాయము ఈనాడు ఎట్లా వున్నదో తెలుసుకోటానికి ఈ బిల్లు పనికి వస్తుంది. కాని దీని వలన వచ్చే పరిణామాలు ఎట్లా వుంటాయో కూడా ఆలోచించవలసినదని నేను ప్రార్థిస్తున్నాను. దీనివల్ల దొంగ మార్కెట్టు ఎక్కువ అవుతుందని కొందరు చెప్పారు. తప్ప కుండా ఎక్కువ అవుతుందనే నా భావము. మొదట డబ్బు తీసుకొనే పెళ్ళికి వస్తారు. ఒక్క చర్తకులలో మాత్రమే భార్యను స్వీకరించే సమయంలో డబ్బు ఇవ్వటం జరుగుతుంది. ఇతర కులాలలో వైలు చార్జీల దగ్గరనుండి మొదలే తీసుకుంటారు.

సమశీల వ్రతులకు సమధనవంతులకు సమచారిత్రులకున్ తమలో సఖ్యమును, వివాహమును గావలయును అని పూర్వులు పలికినారు. అనురాగముతో పెంచిన తమ బిడ్డలను ఉత్తమ స్థితిగల కుటుంబాలకు తమ కొమార్తెలను నివ్వవలెను అని ప్రేమ బాధ్యత కల్గిన తల్లిదండ్రులు మంచి కులము, గోత్రము మంచి ఆచార సంపన్నత కల్గిన అల్లుని వెతుకుతారు. అటువంటి సంబంధము దొరికినప్పుడు అప్పుచేసి తమ శక్తి కొలది ఏదో ఇస్తారు. స్త్రీకి ఆస్తిలో భాగం ఇవ్వనప్పుడు పెండ్లి సమయములోనే ఇచ్చే ఆచారము వచ్చినది. ఈ బిల్లులో కట్నం కాకుండా తిండి, తీర్థం కూడా పెట్టకూడదనే అభ్యంతరం లేకుండా వుండాలని మాత్రమే నేను ప్రార్థిస్తున్నాను.

శ్రీ యల్. లక్ష్మణదాసు :— On a point of information, Sir. అధ్యక్షా. సుబ్బారావుగారు వారియొక్క భాషవల్ల దీనికి అపార్థం కల్పిస్తున్నారని నేను భావిస్తున్నాను. ఈ బిల్లువల్ల వారి సంబంధ బాంధవ్యాలతో అడ్డులు వస్తాయని అంటున్నారు. ఈ నాడు కట్నం యివ్వలేని వారి ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు కావడంలేదు. దేశంలో జరిగే వ్యవహారాలన్నీ తెలిసినవారో ఈ విధంగా మాట్లాడటం న్యాయంకాదు.

మిస్టర్ స్పీకర్ :—ఇందులో information ఏమీలేదు.

శ్రీ కె. సుబ్బారావు :—వారు ఏమి అర్థం చేసుకున్నారో నాకు తెలియదు. 20 వేల రూపాయల కట్నం యిస్తానంటే వద్దని తాను వరించిన కన్యనే వివాహ మాడి ఈనాడు ఒక అధికారిగా సుఖంగా జీవిస్తున్న యువకుడు మన ఆంధ్రప్రదేశ్‌లో నే యున్నాడు. భర్త చనిపోయినప్పుడు పిలిచి నీవు ఈమెను పెండ్లి చేసుకోమని చెబితే తప్పకుండా చేసుకుంటానని అంగీకరించి అతడు పెద్ద ఆచార సంపన్నమైన కుటుంబముతో పుట్టినను, 6 సంవత్సరాలు తల్లిదండ్రులు బలవంతపెట్టినా వినకుండా నీతి పరుడుగా ఆ అమ్మాయినే వివాహమాడి సుఖంగా సౌభాగ్యవంతంగా జీవిస్తున్నాడు. అందువల్ల దేశంలో చట్టం వున్నంత మాత్రాన నీతి పోతుంది, అవినీతి ఏర్పడుతుంది అనేదేమీ లేదు. చట్టం మంచిదే. అపర రామమోహనరాయ్ లాగ శ్రీ కాళేశ్వరరావుగారు రెండవభార్యను చేసుకోకూడదని ఒక చట్టం తెచ్చారు. రెండవ భార్యను చేసుకోకూడదని చెప్పారేకాని మరొక అమ్మాయికి 10 వేల రూపాయలు యిచ్చి రాత్రి పగలు కూడుకోకూడదని చట్టంలో ఎక్కడైనా ఉన్నదా? బహుభార్యా చట్టనిషేధం వల్ల ఒక కరణంగారు మొదటి భార్యకు బిడ్డలు లేక పోగా బిడ్డలు లేక పోతే ఎక్కడ నరకం వస్తుందో యని 10 వేల రూపాయలు ఇచ్చి ఇంకొక అమ్మాయిని ఇంటిలో పెట్టుకొని సుఖంగా కాలం గడుపుతూ బిడ్డలు కలగడం మనకు తెలుసును. నైతిక అవినీతికి ఈ చట్టం పనికి వస్తుందని నేను చెప్పడంలేదు. అందరి కష్ట సుఖాలనూ విచారించవలసి వున్నది. దేశంలో ఎన్ని ఆచార వ్యవహారాలు జరుగుతున్నాయో నాకు తెలుసు. ఒక పెండ్లిలో, పెండ్లి కుమార్తెకు తాళికట్టే సమయం వచ్చింది. ఆ సమయానికి పిల్లవాని తల్లితండ్రులు రాలేదు. రాకపోతే అప్పుడు మేళంతో పోయి వారిని ఒప్పించి తీసుకురావలసి వచ్చినది. పెండ్లికొడుకు తల్లికి 1,116 తండ్రికి 1,116 రూపాయలు సమర్పించి తీసుకు వచ్చేటప్పటికి 3 గంటలు పట్టినది. అంతవరకు తాళికట్టడం ఆగిపోయినది. ఈ వరకట్నం నిషేధాన్ని గురించి చక్కగా ప్రచారం చేయవలెను. అట్లా ప్రచారం చేయడానికి ఈ చట్టం ఉపయోగిస్తుంది. అంతమట్టుకు ఏమీ అభ్యంతరం లేదు. వరకట్నం తప్పు, కన్యాశుల్కం తప్పు అని పెద్దలు పూర్వమే నిషేధం చేశారు.

కాని యింతవరకు వధూవరులకు యిచ్చు డబ్బు దురాచారం కాదు. శక్తికొలది సంతోష పూర్వకముగా యిచ్చుట ధర్మము. యీనాడు దేశంలో వుండే పరిస్థితులను బట్టి ఆడపిల్లలు తమ ఇష్టానుసారం, వారు వలచినవారిని తమ తల్లిదండ్రుల ఇష్టం లేకున్నా పెండ్లి చేసుకొనుటకు పనికివచ్చును. అంతవరకూ నేను చెప్పగలను. 'భార్యా రూపవతి శత్రుః' అని ధర్మశాస్త్రంలో ఉన్నది. అందువల్ల ఒక్క రూపమునే చూచి పెండ్లి చేసుకునేది లేదు. తమ జీవయాత్రకు కావలసిన అన్ని హంగులూ చూచుకోవలెను. ( Interruption ) వారు సంస్కృత పండితులు, ఆచార్యులు, ఎట్లయినా చెప్పగలరు. భార్య రూపవతి అయితే శత్రువు అన్నారు కనుక కులమూ, గోత్రమూ అన్నీ చూడవలెను. వావిలాల గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు స్త్రీలు దీనిని గురించి ఎక్కువగా ప్రచారం చేయవలెను. కట్నం యివ్వవద్దని ఆడపిల్లలు తల్లి దండ్రులకు చెప్పవలెను. అందమైన పిల్లవాడు, మంచి ఉద్యోగం చేసే పిల్లవాడు అల్లుడు కావాలనే కోర్కెలున్నంత కాలం ఈ కట్నాల వ్యవహారం ఉండి తీరును. లేక పోతే వారి యిష్టానుసారం చేసుకుంటారనే ప్రచారంలోకి వచ్చిన సందర్భంలో కట్నాల పట్టింపులన్నీ చట్టాలేమీ లేకుండనే వాటంతట అవి విడిపోతాయి. ఈ నాడు కన్యాశుల్కం అనేది ఆచరణలో ఉన్నది. ఈ బిల్లుకు జాగ్రతగా ఆలోచించి తగిన సవరణలు చేయవలెను. తాను వివాహం చేసుకోబోయే పిల్లకు 3 తూముల బియ్యంతోలి కావలసిన వస్తు సామగ్రి అంతా తీసుకొని వచ్చి ఇస్తేనే పెండ్లికి వచ్చే ఆచారం సాధారణ ప్రజలలో ఉన్నది. కొన్ని కులాలలో 7 సార్లు పెళ్ళాడినా ఆడది చాలా గొప్పది. ఆమె నిత్య ముత్తయిదువని ఆమె ఆశీస్సులో తాళికట్టిచ్చే వారున్నారు. (నవ్వులు).

శ్రీ యల్. లక్ష్మణదాస్ :—అధ్యక్షా, సభ్యులు ఎక్కడా జరుగనటువంటి కబుర్లు చెబుతున్నారు. అటువంటిదెక్కడా లేదు.

శ్రీ కె. సుబ్బారావు :—దేశంలోనే ఉన్నది. లక్ష్మణదాసుగారు కూపస్థమండూకంవలె 3, 4 కుటుంబాల విషయాలను మాత్రమే చూసివుంటారు.****మనం రిఫారమ్సు చేసేటప్పుడు అన్ని విషయాలను దృష్టిలో పెట్టుకోవాలి. దానికి ప్రజాభిప్రాయం పూర్వమే వచ్చింది. ఇంక ప్రచారమే అవసరం. కనీసం శాసనసభ్యులైనా తమ కుమారులకు కుమార్తెలకు పెళ్ళిళ్ళుచేసే సందర్భంలో దానిని ఆచరణలో పెట్టవలెనని దాని విషయమై జాగ్రత్తగా ఆలోచించాలని కోరుతున్నాను.

ముఖ్యమంత్రి (శ్రీ ఎన్. సంజీవరెడ్డి) :—అధ్యక్షా, కొన్ని కులాలను గురించి సుబ్బారావుగారు చెప్పారు. అవి ఎంతవరకు నిజమో authoritative గా తెలియనప్పుడు అట్లా మాట్లాడితే ఆ కులాలవారు వారిని అవ మర్యాద చేసినట్లుగా భావిస్తారేమో కాబట్టి మీరు దయచేసి పరిశీలించి మంచిది కానిచో proceedings నుంచి తీసేస్తే మంచిదేమో.

మిస్టర్ డిప్యూటీస్పీకర్ :—ప్రభుత్వం దగ్గర machinery ఉన్నది. విచారించిన తరువాత అవసరమైతే తీసేస్తాము.

---

*Expunged as ordered by the Chair

శ్రీ బసవ మానయ్య :—అధ్యక్షా, అక్కనాగమ అనే పౌరాణికమైన ఉదాహరణ మనకు తెలుసు. ఇటువంటివి ఉన్నాయి.

శ్రీమతి శాంతాబాయి (కలవకుర్తి—జనరల్) :—అధ్యక్షా, ఈ వరకట్న నిషేధం బిల్లు వచ్చినందుకు చాలా సంతోషం. చాలా దినాలనుంచి ఇది లేనందువల్ల సోదరీమణులు బాధ పడుతున్నారు. ఈ బిల్లును అందరూ సంపూర్ణ విశ్వాసంతో అంగీకరిస్తారనుకుంటాను. ఈ బిల్లును తొందరగా pass చేయాలని నేను మిగిలిన సభ్యులను కోరుతున్నాను. ప్రభుత్వం వారు కూడా ఈ బిల్లు అనధికార బిల్లు అని భావించకుండా మనఃపూర్వకంగా అంగీకరించాలని కోరుతున్నాను. ముఖ్యమంత్రిగారు, ఇతర మంత్రులు కూడా దీనిని support చేయాలి. ఇది ఆడవాళ్ళకు సంబంధించిన బిల్లు, ఆడవాళ్ళే ఎక్కువగా ప్రచారం చేయాలని శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు చెప్పారు. ఇది తొందరగా అమలులోనికి రావాలంటే మగవాళ్ళు కూడా ప్రచారం చేయాలి. బాధ్యతంతా స్త్రీలమీదనే వుంచడం న్యాయంకాదు. ఇట్లా బంధనం చేయడం న్యాయంకాదని శ్రీ సుబ్బారావుగారు అన్నారు. పూర్వకాలంలో అట్లా వున్నదేమో కాని ప్రజా ప్రభుత్వం వచ్చిన తరువాత, పిల్లలు B.Sc. మొదలైనవి చదివాక ఎక్కువగా tenders పెట్టి auction ప్రకారంగా లక్ష ఇస్తామంటే, రెండులక్షలు ఇస్తామని బేరాలు పెడుతున్నారు. తల్లిదండ్రులు వారివద్దకు ఎక్కువ చదువు చెప్పించినా 1,000 రూపాయల వరకు కట్నం ఇవ్వవలసి వస్తోంది. వారు కడుబీద వారైనా ఎక్కడైనా అప్పులు తెచ్చి కట్నం ఇస్తున్నారు.

బిడ్డ రావడమే పాపమా, మునుపటి కాలంలో బిడ్డ పుట్టగానే భూమంతా లోతుపోయినదనే వారు. కాని ఇప్పుడు మనుష్యులే లోతుపోతున్నారు. శాసనసభ్యులందరు ఈ బిల్లును బల పరచాలి. ఈ బిల్లులో కొన్ని విషయాలను గురించి మార్పులు చేయవలసి వున్నవని కొందరు చెప్పారు. అవసరమైన మార్పులు ఉన్నట్లయితే వాటిని చేసుకోవచ్చు. ఈనాడు వేలాది లక్షలాది డబ్బు కట్నాలుగా ఇవ్వవలెనంటే అధిక భాగ్యవంతులకే వీలవుతుంది. కాని సామాన్యులు అలా చేయలేరు. మొగపిల్లలు తలిదండ్రులు కూడా చాలా ఉదారంగా వుండాలి. ఇప్పుడు ఈ విధంగా ఉండడంలేదు. పెళ్ళి సంబంధానికి వెడితే ముందు వర దక్షిణ అక్కడ పెట్టండి, వెనకనుంచి పెళ్ళి విషయం మాట్లాడుకుందాము అని చెప్పడం మంచిదికాదు. నాకు ఇద్దరు కుమారులు వున్నారు. ఆడపిల్లలు లేరు. నేను కంకణం కట్టుకొని ప్రతి గ్రామానికి పోయి వరకట్నాలు తీసుకోకూడదని ప్రచారం చేస్తాను. ఈ విషయం గోపాలకృష్ణయ్యగారికి మనవి చేస్తున్నాను. ఈ బిల్లు చాలామంచిది. ఈనాడు పెండ్లిండ్ల విషయంలో వేలం పాటలు జరుగుతున్నట్లుగా ఉన్నది. వేలమీద లక్షలమీద యీ వేలంపాటు జరుగుతున్నది. ఇటువంటి అన్యాయాలు జరుగకుండా చూడాలని వరకట్నాలను నిషేధించాలని శాసనసభ్యులకు ప్రభుత్వానికి మనవిచేసుకుంటున్నాను.

శ్రీ పి. సుందరయ్య :—అధ్యక్షా, ఇది వరకట్న నిషేధపు బిల్లు కావచ్చు, కన్యాశుల్క నిషేధపు బిల్లు కావచ్చు ఏమైనప్పటికీ అటువంటి వాటిని నిషేధించడానికి యీ బిల్లును ప్రతిపాదించడం జరగాలి. ఈ బిల్లును మనము చట్టము చేసినచో ఉపయోగం వుంటుందా, అమలు చేయటానికి వీలైనదిగా వుంటుందా అనే విషయాలలో నాకు కొన్ని సందేహాలు ఉన్నాయి. ఏమైనప్పటికీ మనము ఏ చట్టముచేసినా నూటికి నూరుపాళ్ళు అమలు చేస్తామనే చట్టం

లేకపోవచ్చు. వరకట్నముల ఇవ్వడం నీతిబాహ్యం అని ప్రచారం చేసే నిమిత్తం ఇది పనికి వస్తుంది. నైతికంగా ప్రజలను ముందుకు తీసికొని పోవడానికి ఇది ఉపయోగకరముగా వుంటుంది. మన సమాజంలో యీ విధముగా వరకట్నములనుగాని కన్యాశుల్కమును గాని తీసుకోవడం నీతి బాహ్యము అనే చట్టవిరుద్ధమైన పని అని ఒక నైతిక వాతావరణాన్ని సాధ్యమైనంత త్వరలో తీసికొని రాగలుగుటకు ఉపయోగ పడుతుందనే ఉద్దేశముతో అయినా యీ చట్టాన్ని మనము అందరం బలపరచవలసి వుంటుందని నేను మనవి చేస్తున్నాను. అంతేనేకాని ఈ చట్టమును పాస్ చేయడం వల్ల సంఘ ఆచారాలన్నీ యీ చట్టంతోనే అంతం అయిపోతాయి అని వెంటనే ప్రతి ఒక్కరు దీనిలో ఉన్న విషయములను అమలు చేయగలమని నేను అనుకోవడం లేదు. వరకట్న ముల నిషేధాన్ని లక్ష్యముగా పెట్టుకొని దీనిని పరిశీలించవలెనని యీ బిల్లును ప్రవేశ పెట్టిన సోదరి సభ్యులను కోరినారు. వేలకొలది, లక్షల కొలది కట్నాలు ఇస్తేనే కాని పెళ్ళిళ్ళు కావడం లేదు, అన్నారు. అంటే సామాన్యముగా యీ బిల్లు మధ్యతరగతి ప్రజలలోను ఆస్థి వున్నటువంటి వారిలోను యీ దురాచారం ఉన్నదని అంటే అది కొద్దిమందికే వర్తించవచ్చు. లక్షలు, వేలు విలువచేసే ఆస్థిగల కుటుంబాలు చాలా తక్కువ. అయితే వరకట్నములను తీసుకోవ డమనేది దురాచారం. సంఘంలోని ఏ వర్గములో ఉన్నను అది మంచిదికాదు దానిని సంఘము అసహ్యించుకోవాలి. వేలు ఇవ్వనిదే లక్షలు ఇవ్వనిదే వరుడు దొరకడంలేదు అంటున్నారు. ఆ విధంగా వేలు లక్షలు ఇచ్చి వరుణ్ణి కనుక్కోవలసిన అవసరం ఏమి వచ్చినదని నేను అడుగుతున్నాను. యీ సాంప్రదాయాన్ని సమూలంగా దేశంలోనుంచి పారద్రోలాలనేదానికి నేనుకూడా నాకు చేత నైనంతవరకు సహాయ పడతాను. అందుకు నాకు ఎటువంటి అభ్యంతరం లేదు. యీ బిల్లు తెచ్చినటువంటి సోదరీమణి దీనిని గురించి చాలా వుత్సాహముగా చెప్పారు. అదీ న్యాయమైనదే. అయితే వేలు లక్షలు పెట్టి వరుని కనుక్కోవలసినదని ఎందుకు వస్తున్నది? ఎందుకని ఈ తహ తహ పడవలసి వస్తున్నది? నా అనుభవమును బట్టి నా అభిప్రాయము లను బట్టి నాకు తెలిసినంతవరకు ఇందుకుగల కారణమును తెలియ చేస్తాను. సమానమైన ఆస్థి, సమాన గౌరవము, సమాన చదువు సంబంధము ఉన్నటువంటి కుటుంబములలో అన్యోన్య ముగా సంబంధములు చేసుకున్నట్లయితే కట్నాలు కన్యాశుల్కాలు ఇవ్వవలసిన విపరీత పరిస్థితులు పోతాయని, అప్పుడు ఈ వరకట్నము అనే దురాచారం, అన్యాయం, మనం నీతి బాహ్యమని చెప్ప వలసిన పరిస్థితి లేకుండా పోతామని అనుకుంటున్నాను. ఈరీతిగా జరుగుతూ వుండడంవల్ల యీ సమస్యలు వస్తున్నాయి. అయితే రూ. 10 వేలో, 20 వేలో ఆస్తి వున్న వ్యక్తి దానిలో కొంత భాగాన్ని తన కూతుళ్ళకు పెండ్లిండ్ల సందర్భములో ఇచ్చినట్లయితే దానికి మనము ఎవరూ కూడా బాధపడవలసిన అవసరం లేదు. దానిని నిషేధించడంకూడా సరిఅయినదని నేను అనుకోవడం లేదు. తన ఆస్తికి మించకుండా, తన తాహతుకు మించకుండా తన ఆదాయానికి మించకుండా పెండ్లిండ్ల సమయములలో తన కూతుళ్ళకు తండ్రి డబ్బుగాని, ఆస్థిగాని ఇవ్వవచ్చు. కాని క్రయం చేస్తే తప్పు, కాని స్త్రీ ధనముగా ఇవ్వడం తప్పులేదు. కాని దురదృష్టవశాత్తు యీ బిల్లులో ఆ రకంగా స్త్రీ ధనం ఇచ్చినను యీ బిల్లుయొక్క స్కోప్ క్రిందకు రాదు అనేది కూడ లేదు.

శ్రీమతి సి. అమ్మన్నరాజా :—ఒక పార్టీ ఇంకొక పార్టీకి ఇవ్వకూడదనే అన్నాము కాని, వాళ్ళ అమ్మాయికి వాళ్ళు పెట్టుకోవచ్చునని ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు.

శ్రీ పి. సుందరయ్య:—నా ఆలోచనా శక్తి అంత దూరం పోలేదు. యీ బిల్లులో వరకట్నం అనే దానికి ఈ క్రింది విధంగా నిర్వచనం ఈయబడినది.

"Dowry" means any property or valuable security given or agreed to be given to one party to a marriage or to any other person on behalf of such party by the other party to a marriage or by any other person on behalf of such other party either at such marriage or before or after such marriage as consideration for any betrothal or marriage between the said parties, but does not include Dower or Mahar in the case of persons to whom the Muslim Law applies."

దీనినిబట్టి స్త్రీధనం ఇవ్వడం కూడా నిషేధింప బడగలదని అనుకుంటున్నాను. దేనిని వరకట్నంగా తీసుకోవాలి అనేది స్పష్టంగా లేదు. అయితే శ్రీమతి అమన్నరాజాగారు చెప్పినట్లు స్త్రీధనం యీయవచ్చునని అంగీకరించితే యీ బిల్లు నిరుపయోగం అయ్యే పరిస్థితులు రావచ్చు. స్త్రీ ధనం తీసుకోవచ్చుననే అవకాశాన్ని పురస్కరించుకొని, నీ కూతురుపేర ఎన్నివేలు ఇస్తావు ఎన్ని నగలు పెడుతావు ఎన్ని లాంచనాలు ఇస్తావు అని అడగ వచ్చు. ఆ విధంగా నిర్బంధించి, తీసుకోవచ్చు. అందువల్ల ఈ బిల్లుయొక్క ఉద్దేశం నెరవేరదేమో నని భయపడుతున్నాను. ఇంత ఆస్తిని కూతురు పేర పెట్టమని అడిగినా అది వరకట్నం క్రిందకు రాకపోతే యీ బిల్లు ఉట్టి పేళాకోళం అవుతుంది. కాబట్టి స్త్రీధనం గా కూడ డిమాండ్ చేయడమనేది న్యాయంగా యీబిల్లు క్రిందకు రావాలి. లేక పోతే అది నీతి బాహ్యమైనదని చెప్పలేము. పెండ్లి కావడానికి చేసే ఒత్తుడులు అన్నీ కూడా వరకట్నం క్రిందకు వచ్చినట్లయితే కొంత మేలైనా జరుగవచ్చునేమో నని లేకపోతే నైతికంగా కూడ లాభదాయంకాని బిల్లు చేస్తున్నామేమోనని అనుకుంటున్నాను.

తమకన్న ఎక్కువ ఆస్తి ఉన్నవారికి, తమకన్న ఎక్కువ చదువుకొన్నవారికి, తమకన్న ఎక్కువ అధికారములో ఉన్న వారికి, తమ కూతుళ్ళను యిస్తే సుఖపడతారనే ఉద్దేశంతో చేస్తున్నారు. వరదక్షణ యివ్వటానికి అదే కారణమని నేననడం లేదుగాని అది ఒకకారణం అవుతుంది. అది వారిచేతులలో ఉన్నపని. తమ కూతుళ్ళకు పెండ్లి చేసేటప్పుడు వరునకు తమకన్న ఎక్కువ ఆస్తి ఉన్నదా, అధికారం ఉన్నదా—అనేది కాకుండా, అతను గుణవంతుడా, కష్టించి, ఏదైనా వృత్తిచేసుకొని గౌరవంగా బ్రతుకుతూ, తమ అమ్మాయితో అన్యోన్యంగా మెలగి జీవించగలడా—అనేది ఆలోచించి వివాహాలు చేయవలసి యుంటుంది. 50 వేలు యిచ్చి, లక్ష యిచ్చి, తమకన్న ఎక్కువ ఆస్థి ఉన్నమనిషిని కొనుక్కునేదాని కన్నా, గుణవంతుని, నీతివంతుని, కష్టపడి తనకాలుమీాద తాను నిలబడగలిగేవానిని యెంచి తమ అమ్మాయిని యిస్తే, సమస్యే ఉండదు. మన సంఘంలో యింకొక దురాచారం ఉన్నది. ఇదివరకు ఆడపిల్లలకు 8 యేండ్ల వయస్సుననే పెళ్ళి అయ్యేది. కాని చదువుకొంటున్నవారు, 20, 25 ఏండ్లవయస్సువచ్చే వరకు పెళ్ళి కాకుండా ఉన్నట్లయితే—అది దూరాచారం క్రింద, అటువంటి వయస్సు గలిగిన అమ్మాయిని కులటక్రింద, నీతి బాహ్యపు స్త్రీక్రింద చెప్పుకొనే దూరాచారం. దురదృష్టవశాత్తు మన సంఘంలో ఉన్నది. అసలు స్త్రీ యొక్క నీతి నియమాలనేది పెళ్ళి అవటం, కాకపోవటం మీాద ఆధారపడి లేదు. పెళ్ళికానటువంటి పురుషుని యొక్క ప్రవర్తన గురించి, అతని

పెళ్ళికాలేదు కాబట్టి దుర్మార్గుడు నీతి బాహ్యుడు అని అనుకోవడం లేదు. అలాగే స్త్రీకికూడా పెళ్ళి కాకపోయినా, నీతి బాహ్యమైనదనే అపవాదు మన సంఘంలో పోవాలి. రజస్వల అయి 16–20 ఏండ్లువచ్చిన స్త్రీ పెళ్ళికాకుండా ఉండటం ఏదో పాపంగాను, అపరాధంగాను మన సంఘం భావిస్తున్నందువల్ల ఏదో రీతిగా పెళ్ళి చేయవలసి వస్తున్నది. ఏదో పెళ్ళి చెయ్యాలనే టప్పటికి ఆస్థి ఉన్నవాళ్ళలో కూడ డబ్బుకావాలని, పెళ్ళి చేసుకొనుటకు ఎంత డబ్బు యిస్తావని బేరం పెట్టడం జరుగుతోంది. ఈ దురాచారం పోగొట్టడానికి ప్రయత్నం చేయాలి. సంఘం నుంచి ఈ దురాచారాన్ని దూరం చేయాలంటే స్త్రీలు స్వయంపోషకంగా ఉండటానికి అవకాశాలు, విద్య, వృత్తులు సౌకర్యాలు కల్గించాలి. స్త్రీకి తన తండ్రి ఆస్థిలో సమాన హక్కు లేకుండా ఉన్నది. ఇప్పుడు హిందూ లా స్త్రీ విషయంలో కొంత సవరణ చేసినప్పటికి పూర్తిగా స్త్రీకి సమాన హక్కులు వచ్చినవనుకొనుటకు వీలు లేదు. సమాన హక్కు ఆస్థిలోనేకాదు. స్త్రీ చదువుకొని తననుతాను పోషించుకొనుటకు ఏదో ఒక వృత్తి చేసుకొనుట తప్పకాదు— అనే భావం ప్రజలలో కలగాలి. ముఖ్యంగా మధ్య తరగతి ప్రజలలో పెళ్ళిళ్ళు కాకుండా ఏ నర్సు పనో, డాక్టరుపనో, టీచరుపనో, సంఘసేవో, చేస్తూంటే, పెళ్లికాని అమ్మాయి ఏదో చెడ్డపని చేస్తున్నదనే ధోరణి సంఘంలో పోవాలి. అటువంటి అవకాశాలు స్త్రీలకు కలిగించాలి. ఒక అమ్మాయి చదువుకొని తన కాళ్లమీద తాను నిలబడగలిగిన స్థితి వచ్చినప్పుడు, ఎవరైనా వచ్చి నన్ను పెళ్ళి చేసుకొనుటకు యిన్ని రూపాయిలు యిస్తేనేగాని పెళ్ళి చేసుకోను అంటే, అటువంటి మనిషిని చూచి "నీవు నాకు తగని మనిషివి, నన్ను కొనుక్కొని నీ ఉంపుడు కత్తెగా నీ దాసీ దానిగా చేసుకొనేందుకు పనికిరాను, నాకు ఆత్మగౌరవం ఉన్నది, నీలాగే మనిషిని" అని నిలబడగలిగే స్త్రీ అవాలి. అటువంటి విశ్వాసం, ఆత్మగౌరవం ఎప్పుడువస్తుందంటే తన జీవితాన్ని పోషించుకునేందుకు సమాన అవకాశాలు ఉంటేనే, ఆమె నిలబడ గలుగుతుంది. తల్లి తండ్రులకు కూడ, సంఘ దురాచారాలనుంచి బయట పడటానికి త్వరగా తమ అమ్మాయిలకు పెళ్ళి చేస్తే యీ పీడ వదిలి పోతుంది అనే ధోరణి పోతుంది. కాబట్టి స్త్రీలు వాళ్ళకాళ్ళ మీద వాళ్ళు నిలబడాలంటే విద్య, వృత్తులలో సమానావకాశాలను కలిగించాలి. ఆ విధంగా సమాజం మారనంతవరకు ఈ దురాచారం ఏదో రూపంలో జరుగుతూనే ఉంటుంది. దానికి కావలసిన రీతిగా మన ఆర్థిక విధానం మార్చుకోవలసి యుంటుంది. మన సమాజంలో ఆర్థిక విధానం మార్పు చెందేదాకా, పెళ్ళికాని స్త్రీ కులట అనే భావం పోయేదాకా, ఈ చట్టాన్ని తీసుకురాకూడదని చెప్పుట సరికాదు. ఈ చట్టాన్ని యిప్పుడేతీసుకురావాలి. డబ్బు పెట్టి వరుని కొనుక్కొని పెళ్ళి చేసుకోవటమనేది నీతి బాహ్యమైన పని అని అది చట్టవిరుద్ధమని ప్రజలలో ప్రచారం చేయటానికి ఈ చట్టం పాస్ చేయుట అవసరం.

ఈ బిల్లులో కొన్ని క్లాజులు సరైనవికావు. వాటిని జాగ్రత్తగా ఆలోచించి సవరించవలసి యున్నది. ఈ వరదక్షిణ ఋజువుచేయుటకు సాక్ష్యం కావాలంటారు. ఇచ్చిన వారిది ఎంత తప్పో, తీసుకున్నవారిదీ అంతే తప్పని, యిద్దరికి ఒకే రకమైన శిక్షానేరం క్రింద పెట్టారు. ఇచ్చినవానికి, తీసుకొన్నవానికి—యిద్దరికి నేరం అంటే, యిచ్చినవారు యిచ్చినట్లు, తీసుకొన్నవారు తీసుకొన్నట్లు చెపుతారా? దానికి సాక్ష్యం ఎవరు యిస్తారు? అందువల్ల ఈ క్లాజు యిట్లాగే ఉంటే, యిది అమలులోకి రాక నిరుపయోగ చట్టం క్రింద ఉంటుంది. నేను పార్లమెంటులో ఉన్నప్పుడు లంచగొండితనం గురించి ఒక చట్టం తెచ్చారు. లంచం యిచ్చిన

వానికి, పుచ్చుకొన్నవానికి కూడ శిక్ష ఉండాలనే సవరణ వచ్చింది. అట్లాగైతే లంచగొండి తనాన్ని ఎప్పటికైనా అరికట్టగలరా? ఇచ్చినవానికి, తీసుకొన్నవానికి—యిద్దరికి శిక్ష అంటే ఎవరూ సాక్ష్యం చెప్పరు. ఆ దురాచారాన్ని—ఆపు చేయుట సాధ్యంకాకుండా పోతుంది.

అందుచేత కట్నాలు ఇచ్చేవారికి, తీసుకొనేవారికి కూడ శిక్షలు వేయటము, ఇద్దరిని ఒకే కేటగరిగా పెట్టటం తప్పు. కాబట్టి కట్నాలు ఇచ్చినవారిని నేరస్థులుగా పరగణింపకూడదని నా మొదటి సూచన. ఈ కేసులను మేజిస్ట్రేట్ విచారించాలని అన్నారు. ఒక సంవత్సరం లోపల కంప్లెయింట్ చేస్తే, ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ విచారించాలని అన్నారు. ఫస్ట్‌క్లాస్ మెజిస్ట్రేట్ కాక సెషన్సుకోర్టుకు విచారణాధికారము వుండాలి హిందూ వివాహ చట్టంలోను డైవర్స్ కేసుల విషయంలోను ఆ అధికారం ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్స్‌కు కాకుండా సెషన్ కోర్టుకు ఇచ్చినట్లు జ్ఞాపకం.

*Sri E. Ayyapu Reddi (Nandikotkur-General):* On a point of information, Sir. Even the offences under the Bigamy Law are cognizable only by a First Class Magistrate. They are tried only by a First Class Magistrate, and not by a Court of Session.

శ్రీ పి. సుందరయ్య :—ఆ విషయం వస్తే, అక్కడ కూడా, సెషన్ కోర్టుకే ఆ అధికారం ఇవ్వాలని, నా సూచన ఉంటుందనుకోండి. విడాకుల చట్టంలో "ఎనీ ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్" అని అన్నట్లు నాకు జ్ఞాపకం లేదు. మిగిలిన అన్ని నేరాలు లాగానే, ఇదీ ఒక నేరం క్రింద ఏ ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేటుకో ఇచ్చేదానికి నేను అంగీకరించటం లేదు. కాబట్టి ఫస్ట్‌క్లాస్ మేజిస్ట్రేట్ కాకుండా, ఏ సెషన్ కోర్టో, లేదా స్పెషల్‌హోదా ఉన్నటువంటి జడ్జిలో, దానికోసం ఉండాలని నేను కోరుతున్నాను. "Complaint made within one year from the date of offence"అన్నారు. కాని "complaints made by the aggrieved party" అని పెట్టాలని నా ఉద్దేశము. కాబట్టి ఎవరికంటె వాళ్ళకి (ఆ కేసుతో సంబంధం లేని ప్రతివారికి) కోర్టుకు తీసుకువెళ్ళే హక్కు ఇవ్వకూడదని నా యొక్క ఉద్దేశము.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—డబ్బు ఇచ్చినవారు ఎగ్రీవ్డ్‌పార్టీ. తండ్రి పిల్లకుగాను డబ్బు ఇస్తాడు. అల్లుడుమీద ఆయన దావా వేస్తాడా?

శ్రీ పి. సుందరయ్య :—రామకృష్ణరాజుగారికి అది ఎందుకు అసంభవముగా కనిపిస్తున్నదో నాకు అర్థం కావటం లేదు.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ :—సభ్యులు క్లాజు బై క్లాజు చర్చ వచ్చినపుడు ఆ విషయాలు చెప్పవచ్చును.

శ్రీ పి. సుందరయ్య :—బిల్లు యొక్క క్లాజులలోగల జనరల్ పాయింట్స్ చెబుతున్నాను. ఈ క్లాజులలో యీ లోపాలు ఉన్నాయి అని చెప్పటం జనరల్ డిస్కషన్‌లోని భాగమే అవుతుంది.

ఏడవ క్లాజులో " తప్పుచేసినవారికి ఆరునెలలు శిక్షగాని, వేయి రూపాయలు జరిమాన గాని వేయాలని " ఉన్నది. ఈ సాంఘిక బిల్లుల విషయంలో జైలు శిక్షలు విధించటం అన్నది అనవసరమని నేను భావిస్తున్నాను. కట్నాల నిషేధం విషయంలో జైలు శిక్షలు పెట్టటానికి నేను పూర్తిగా వ్యతిరేకమని చెబుతున్నాను. కట్నాలు ఇచ్చి స్త్రీలకు పెళ్ళిళ్ళు చేస్తున్నారు ఆ విధంగా ఎన్నో ఇబ్బందులు పడుతున్నారు. నిజమే. బలవంతంగా కట్నాలు ఇవ్వాలని ఎక్కడా చట్టం లేదు. ఇంత ఆస్తి ఇస్తేగాని పెళ్ళిచేసుకోవటానికి వీల్లేదని చట్టం లేదు. కాని, నేడు సంఘంలో ఉన్న పరిస్థితులుబట్టి చేస్తున్నారు. సంఘ ఆచారాన్ని బట్టి కట్నాలు ఇస్తున్నారు.

ఒక తండ్రి కూతురికి స్త్రీ ధనం పేర డబ్బు ఇస్తాడనుకోండి. లేదా వరుడిపేర ఇస్తాడను కోండి. తన జీవితంలో ఎప్పుడైనా సరే ఆ స్త్రీ " నా పెళ్ళి సందర్భంలో నా భర్తపేర ఇచ్చిన ఇన్నివేల రూపాయలు నావి. అది నా డబ్బు క్రింద రావాలి." అని క్లెయిం చేసే అధికారం ఇవ్వాలి. నా సూచన ప్రకారం ఆ హక్కు స్త్రీకి ఇవ్వాల్సి ఉంటుంది. కట్నంగా గాని, ఏ విధంగా గాని పెళ్ళి సందర్భంలో ఇవ్వబడిన డబ్బు ఎప్పటికైనా స్త్రీకే చెందవలసి ఉంటుంది. ఆ డబ్బుపైన హక్కు స్త్రీకే ఉండాలి.

నేను పీనల్ క్లాజుకు వ్యతిరేకము. తల్లితండ్రులు తమకు ఇష్టమైతే కొంత డబ్బు కట్నంగా కూతురుకు ఇవ్వవచ్చు. అటువంటివారిని బలవంతంగా యీ చట్టం క్రింద శిక్షించ నక్కరలేదు. వారిని వదలిపేయండి. కాని కొన్ని సందర్భాలలో ఎవరైనా "నీ తండ్రి ఇస్తానన్నాడు ఇంకా ఇవ్వలేదు కాబట్టి పెళ్ళిపో " అని చెప్పి భార్యను మర్యాదగా చూడకుండా అగౌరవంగా చూసి పీడిపించటం జరగవచ్చు. డబ్బుకోసం పెళ్ళిచేసుకొని అమ్మాయిని మరింత గౌరవంగా చూస్తా డని కూడా అనుకోలేము. కాని విడాకులు చట్టం ప్రకారంగా స్త్రీ తన భర్తనుంచి డబ్బు కోరేటప్పుడు, " తన పెళ్ళి సందర్భంలో భర్తకు ఇవ్వబడిన డబ్బుకూడా తనదేనని " అడగవచ్చు. ఎప్పుడైనా ఆ డబ్బుమీద స్త్రీకే అధికారం ఉండాలి. "ఇది పెళ్ళి సందర్భంలో ఇచ్చిన డబ్బుకాదు నేను స్వయంగా సంపాదించిన డబ్బు" అని రుజువు చేసుకొనే బాధ్యత వరుడిపైననే పెట్టాలి. ఆ విధంగా చేస్తే "ఆ డబ్బు నాకు దక్కేదికాదు, అది స్త్రీకే చెందుతుంది" అని వరుడు అనుకొంటాడు. ఆ విధంగా కొంతవరకైనా ఆ డబ్బు అదుపులో ఉంటుంది. బాధ పడుతున్న స్త్రీలకు, ఆ డబ్బు స్త్రీ ధనంగా మార్పించటానికి ప్రయత్నం చేస్తే బాగుంటుంది.

తమ దగ్గర కట్నం తీసుకొన్నారని, తల్లితండ్రులు కోర్టుకు వెళ్ళవచ్చును. అంతేగాని ఎవరంటే వాళ్ళు కంప్లేంట్ చేయవచ్చు అంటే, భార్యా భర్తల సందర్భంలో, రెండు కుటుం బాల మధ్య జరిగే గొడవల్లో, కక్షకోసం, పగ ఉంటే పగ సాధించుకోవటానికి మూడవ మనిషి వెళ్ళి, వారిని కోర్టులకు యీడ్చించే ప్రమాదం ఉంటుంది. అటువంటి ప్రమాదం లేకుండా ఉండటంకోసం, ఎగ్రీవ్డ్ పార్టీయో, తల్లిదండ్రులో, కూతురో, ఎవరో అటువంటి కొంత మందికే కంప్లేంట్ చేసే హక్కు ఇవ్వాలి. క్రిందా మీదా పడి, వాళ్ళూవాళ్ళూ సుఖంగా ఉన్నప్పుడు మధ్య మనకు వచ్చిందేమిటి ? కట్నం తీసుకోవటం తప్పని చెబుదాము. అది న్యాయంకాదని చెబుదాము. అంతేగాని, వాళ్ళను కోర్టుకు యీడ్చి, శిక్షలు వేయించ వలసిన అవసరం ఇతరులకు కలిగించకూడదు, ఆ హక్కు వారికి ఉండకూడదు. అందు

చేత ఎగ్రీస్డ్‌పార్టీకి మాత్రమే ఆ రకంగా కంప్లైంట్ చేసే అవసరం ఉంటుందని చెబుతున్నాను. ఇవి నాకు తోచిన సూచనలు. వాటిని జాగ్రత్తగా ఆలోచించాలని కోరుతూ నేను ముగిస్తున్నాను.

శ్రీ ఎస్. వెంకయ్య (అద్దంకి) :—అధ్యక్షా, వరకట్నము స్వీకరించడమనేది చాలా దురాచారమనే నేను విశ్వసిస్తున్నాను. కాని యిది ఏ రూపములో ఎవరు స్వీకరించినను, ఎవరు యిచ్చినను, యిది అవినీతి చర్యగా భావించాలి. మామూలుగ సాంఘిక న్యాయమును, వివాహ ధర్మమును గుర్తించకుండ, స్త్రీ పురుషుల యొక్క విలువలు గుర్తించకుండ ఒక్క డబ్బునే లెక్కలోకి తీసుకోవడము చాలా దురాచారమని అభిప్రాయము. అయితే యిప్పుడు యీ చట్టమువల్ల వరకట్నము స్వీకరించడము నిషేధించ బడుతుందా? దీనిని అరికట్టటానికి అవకాశము ఉన్నదా? అవకాశము ఉన్నదని ధృఢపరిస్తే, నేను దీనిని తప్పకుండ బలపరుస్తాను. లేకపోతే యిలాంటి చట్టములు ఎన్ని చేసినను ప్రయోజనము లేదని నా అభిప్రాయము. పైగా యిది ప్రమాదకరమనికూడ మనవి చేస్తున్నాను. ఇలాంటి బిల్లులు తెస్తే సంఘములో గౌరవము, మర్యాద పొందవచ్చునని ఉద్దేశించి తేవడము తప్ప ఇది ఆచరణలోనికి తెచ్చేటప్పటికి యిది సాధ్యముకాని పని. పైగా యిలాంటి చట్టము చేయడము గౌరవ ప్రదము కాదు. ఇక మీదట మనము చేసే శాసనములకు ఏ మాత్రము విలువ ఉండదు. సాధారణముగ ఏ శాసనము లైనా మనము చేసేటప్పుడు అవి ఆచరణలో పెట్టటానికి ఎలాంటి అవకాశములు ఉండగలవో ముందుగా ఆలోచించి తేవలసి వుంటుంది.

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ (ఖమ్మం—జనరల్) :—గౌ. సభ్యులు యిది ఆచరణ సాధ్యము కాదు అంటున్నారు. సాధ్యము కానటువంటి శాసనమును యిప్పుడు చేయవలసిన అవసరము ఉన్నదనే ప్రజాభిప్రాయము ఉన్నది గనుకనే............

మిస్టర్ డిప్యూటీ స్పీకర్ :—వారి యొక్క అభిప్రాయము చెబుతున్నారు.

శ్రీ యస్. వెంకయ్య :—మనము యిక్కడ యిలాంటి శాసన పరంపర ఏదో చేయడము మన శాసన సభకు, సాంప్రదాయానికి విలువైన విషయముకాదు. సంఘానికి ఏది అవసరమో అది ఆచరణలో పెట్టగలమా, పెట్టటానికి అవకాశములు ఉన్నవా, లేవా? అనేది ముందుగా శోధించుకుని శాసనము చేసినప్పుడే మనకు విలువ, శాసన సభకు విలువ, ప్రభుత్వానికి విలువ యినుమడించగలదేగాని ఆచరణకు సాధ్యముకానివి తెచ్చి, యిది ప్రయోజనకరమైనదిగా ప్రభుత్వము చేయలేకపోయిందని అనిపించుకోవడము మంచిదికాదు. ఇంతవరకు కొన్ని చట్టములు చేశాము. అవి సరిగా ఆచరణలోనికి వస్తున్నాయా! శారదా చట్టము అని బాల్య వివాహములను అరికట్టగలిగిందా? ఆ యాక్టు అమలులో ఉన్నదని తెలిసినప్పటికినీ, బాలలను యితర ప్రదేశములకు తీసుకుని పెళ్ళి పెళ్ళి చేయించుకుని వస్తున్నారన్న సంగతి సభ్యులకు తెలియదా? అప్పుడు యీ చట్టము ఏమిచేయ గలిగింది? కాబట్టి రానురాను కాలము జరిగిన కొద్దీ, సంఘములో మార్పులు వచ్చి, యీ విధముగ బాల్య వివాహములు చేయడము చాలా అన్యాయము అని తెలిసిన తరువాతనే, యివి ఆపు జేశారు. కాని చట్టమువల్ల కాదు. క్రమేణ బాల్య వివాహములు చేయడము తగ్గింది. అయినప్పటికినీ యీనాటికినీ, బాల్య వివాహములు చేయదలచినవారు ఎక్కడికో

తీసుకుని పోయిచేస్తూనే ఉన్నారు. బాల్య వివాహములు ఏదో రూపములో చేయడము, శాసనమునుంచి తప్పించుకోవడము జరుగుతూనే ఉన్నది. అక్రమము అన్యాయము అని గ్రహించినవారు చేయడము లేదు. అదే విధముగ మద్యపాన నిషేధ చట్టము చేశారు. దానిని ఆచరణలో ఎంతవరకు పెట్టగలిగినదీ మన కందరికీ తెలియదా ? ఎక్కడెక్కడ ఎంతెంత విరివిగా సాగుతున్నదో మనము పత్రికలలో చూస్తూనే ఉన్నాము. గనుక యీ చట్టము ఆచరణ సాధ్యము అయినదని చెప్పగలరా ? ఈ విషయమునకు సంబంధించిన రిపోర్టులు మన ఎదుట ఉండనే ఉన్నవి. కాబట్టి యిటువంటి చట్టములవల్ల ఎంతవరకు ప్రయోజనము ఉండగలదో మనకందరికీ స్పష్టముగ తెలిసిన విషయమే. అలాగే వడ్డీ వ్యాపారస్థులు అధిక వడ్డీ తీసుకోకుండా 8 అణాలు వడ్డీకి మించి తీసుకోకూడదని నిర్ణయిస్తూ చట్టము తెచ్చాము. వడ్డీ వ్యాపారస్థులు ఏమిచేస్తున్నారో మనకు తెలియదా ? అవసరమును బట్టి ఎంత వడ్డీకి అయినను ఒప్పుకుని తెచ్చుకునేవారు లేరా ? అప్పుడు యీ చట్టము ఏమి చేయగలిగింది ? 80 రూపాయలు కావాలంటే, వడ్డీతో కూడ కలుపుకుని నూరు రూపాయలకు వ్యాపారస్థుడు నోటు వ్రాయించుకుంటున్నాడు. తాను అడిగిన వడ్డీ తీరిపోయిన తరువాత, ఆ నోటు మీద డబ్బు వసూలు కాకపోతే, దావా వేసి మొత్తము సొమ్మును వసూలు చేసుకుంటున్నాడు. ఈ విధముగ చేయకుండ మనము అరికట్టగలిగామా ? కాబట్టి సంఘములో మార్పు రావాలని అంటున్నాను. ఇప్పుడు యీ బిల్లును ప్యాసుచేస్తే, తల్లితండ్రులకు ఒక విధముగ బాధ కరమేమోనని నా అభిప్రాయము. ఎందుకంటే భూమి రూపములోనో, లేక మరొక రూపము లోనో యిస్తామని నిర్ణయము చేసుకుని వివాహ లగ్నము దాటిపోయి తతిమాతమలో జరిగిన తరువాత యిటువంటివి చదివింప జేసుకుంటారు. అప్పటికప్పుడు ఏదైనా యిబ్బందులు ఉన్నవారో వారి వారి మధ్య ఉన్న నమ్మకము మీద ఏదో విధముగ సర్దుబాటు చేసుకుంటారు. కాని కావాలని అనుకున్న వరుని కోసము తల్లి తండ్రులు ముందుగనే అన్వేషణ ప్రారంభించి సాధించుకోటానికి ప్రయత్నిస్తారు. అదే విధముగ కావాలన్న వధువు విషయములోనూఅంతే. డబ్బు రూపములో లభించే పరిస్థితి ఉంటే, అదిరొక్కం రూపములోనే చేతిలో రహస్యముగ పడవేసి వివాహములను నిర్ణయించుకోవచ్చు. దాన్ని ఏమైనా అరికట్టటానికి వీలు ఉన్నదా ? కుమార్తెకు వెంటనే వివాహము కావాలని అంటే, డబ్బు తీసుకుని పోయి చేతిలో పెట్టితేనే ఒప్పందము జరుగుతుంది గనుక, సరే ఆస్తి ఉన్నవారు ఆస్తులను తాకట్టు పెట్టుకోనో లేక అమ్ముకునో, అప్పటికప్పుడు అది తీసుకునిపోయి యిచ్చి సర్దుబాటు చేసుకోకుండా, ముందు గానే తన ఆస్తిని అమ్ముకుని ధ్వంసం చేసుకునే పరిస్థితి వుంటుంది. ఆ పరిస్థితులలో తల్లి తండ్రులు ఎంత బాధపడుతూ ఉంటారో ఆలోచించాలి. మనము ఏ ఆశయముతో తల్లి తండ్రులు బాధపడకుండ, యీ పరిస్థితిని నివారించటానికి దీనిని ఆలోచిస్తున్నామో, ఆ ఆశయమునకు విరుద్ధముగ జరగదు, యీ చట్టమువల్ల తప్పకుండచేయగలమని ఎవరైనను విశ్వసిస్తారా ? అటువంటి విశ్వాసము నాకు కలుగ జేస్తే నేను దీనిని తప్పకుండ బలపరుస్తాను. ఆ విధముగ కాకుండ పరోక్షముగ తల్లి తండ్రులను యింకను బాధించే యీశాసనమును అమలులోకి వచ్చి పెట్టినట్లైతే, డబ్బు కొరకు, తగిన వరుడరు దొరకకుండ బాధపడడమే కాకుండ, వాళ్ళను యింకను బాధించడమవుతుందని నేను అనుకుంటున్నాను. ఇదీ ప్రతివారి మనస్సు బాధింప జేయడము తప్ప మరేమి లేదు. అసలు కట్నము కొరకు ఆశ పడడము, స్వీకరించడము సిగ్గు చేటు,

అనే మనోపరివర్తన వచ్చి, యిది సంఘములో వ్యాపింప జేస్తే తప్ప దీనివల్ల ప్రయోజనములేదు. సంఘములో ప్రచారము ద్వారానో, నాటక ప్రదర్శనములు, పరిషత్తులద్వారానో ప్రచారము చేయటానికి ప్రయత్నించాలి. ప్రతి యువకుని మనస్సులోను యిది చాలా నీచమైనదని తెలియ జేయాలి. అది అతను గ్రహించినప్పుడే యిది నిషేధించబడ మవుతుంది. అలాంటప్పుడు యీ బిల్లు యొక్క అవసరమే ఉండదు. ఈ విధముగ కొంతకాలము జరిగితే అది పూర్తిగ నశించి పోతుంది. కాని, యిలాంటి చట్టముల వల్ల యిప్పటి పరిస్థితులలో ప్రయోజనము లేదు. బాధపడుతున్న తల్లి తండ్రులను మరింత బాధపడేటట్లు చేయడము అవుతుంది. ఏదో యీ చట్టము ప్యాసు చేస్తే, యిక మీదటనైనా మార్పు రాకపోతుందా, అలాగే క్రమేణా తగ్గిపోతుందని భావింపవచ్చు. ఎప్పుడో మార్పులు వస్తాయి అని భావించే బదులు, యిప్పటికే సంఘములో మార్పులు రావడము ఆరంభమైనవి. గనుక ముందుగ మన సోదరీమణులు ఈ ప్రచారము ప్రారంభించి గట్టిగ కృషి చేయాలి. నా అనుభవములో పురుషులకంటే స్త్రీలే యీ కట్నమునకు ఆశించడము చూస్తున్నాను. తమ బిడ్డలకు కట్నములు తీసుకుని ఆస్తులు పెంపు చేసుకోవాలనే ఆశ గలవారు యీనాడు యిళ్ళలోనే ఒత్తిడి చేయుచున్న స్త్రీలు ఎంతోమంది ఉన్నారు. ముందు వారివద్దకు పోయి, యిది మంచి పని కాదు, నీచము అనేది ప్రబోధింప జేయుండని మన సోదరీమణులను నేను కోరుతున్నాను. ముందు వారు యీ కృషికి తల ఒగ్గినట్లైతే యీ ప్రచారము ఒకే విధముగ ప్రారంభింప జేసినవారమవుతాము. అలాంటి ప్రచారము విరివిగ సాగించి కొంత మార్పు కలుగ జేసినట్లైతే ముందు కట్నము వద్దు అను పురుషుల బాధ తగ్గించిన వారమవుతాము. కట్నమునకు ఆశపడడమనేది సిగ్గుచేటు, నీచము అనేది ముందు వరుడికి తెలియజేయాలి. ఇది వారు గుర్తించి, ఏనాడు అయితే యీ కట్నము అనేది నాకువద్దు అని చెప్పగలుగుతారో, ఆనాడే తల్లితండ్రుల బాధను నివారింప చేయగలిగారు అని సంతోషించగలము. అంతేకాని ప్రస్తుత పరిస్థితులలో ప్రయోజనము లేదు, ఒకవేళ ప్యాసు చేసినను, ఏదో కొంత మార్పు తీసుకుని రాగలరేమో కాని, యిది పూర్తిగా నశించి పోయింది అని చెప్పుకోటానికి తరములు దాటుతవి. ఇప్పుడు దీనిని ప్యాసుచేస్తే, ప్రజలలో నిరుపయోగమైన సమస్యలు ఏర్పడి, యింకను సంఘము విపరీతమైన పరిణామాలకు, అవస్థలకు దారి తీస్తుంది. ఆ విధముగ కొత్తగా బాధలు కలుగ జేసే బదులు, యీ బిల్లును యింకను కొంతకాలమువరకు ఆపి, ముందు ప్రచారము ద్వారా కొంత మార్పు తేవటానికి ప్రయత్నించి, ఆ మార్పువచ్చిన తరువాత యీ బిల్లు తెచ్చి ప్యాసు చేస్తే అందరూ అంగీకరిస్తారు ప్రయోజనకర మవుతుంది. అప్పుడు వ్యతిరేకించే వారు ఏ కొద్ది మందో వుంటారు, యువకులలో గూడ చైతన్యము ఏర్పడి ఉంటుంది, కట్నం నిషేధించాలి, యిది నీచము అని తెలుసుకొనగలుగుతారు. వారిలో వారే యింకను కట్నము కోరేవారు ఉంటే, వారిని discourage చేసేపరిస్థితి వస్తుంది. కాబట్టి దీన్ని ప్రస్తుతము వాయిదా వేయవలసిందిగా కోరుచున్నాను. ఈ బిల్లుకు నా వ్యతిరేక అభిప్రాయమును వెల్లడిస్తూ దీన్ని ప్రస్తుతము ప్రవేశ పెట్టటానికి ప్రతిఘటిస్తూ విరమిస్తున్నాను.

శ్రీ పి. శ్రీరాములు (దుగ్గిరాల) :—ఉపాధ్యక్షా, ఈ దినము ప్రవేశ పెట్టబడిన వరకట్న నిషేధపు బిల్లును గౌ. సభ్యులు అమ్మన్నరాజాగారు ప్రవేశ పెట్టడమనేది చాలా సమంజ సముగనే ఉన్నది. ఇది ఇప్పటికి రెండు సంవత్సరములకు పూర్వము మనం ఆంధ్రరాష్ట్రములో ఉండగా ప్రస్తుతము మనకు శాసనసభాపతి అయిన శ్రీ కాళేశ్వరరావుగారు తీసుకుని రావడము

జరిగింది. తరువాత దీన్ని సెలక్టు కమిటీకి ప్రజాభిప్రాయ సేకరణకు పంపడము, అవి అన్నీ చేర్చి బిల్లును సరిజేసిన పిమ్మట యీనాడు ఆంధ్ర ప్రదేశ్ శాసన సభముందు ప్రవేశపెట్టబడింది. కాని దీన్ని ప్రవేశ పెట్టటానికి వారికి అవకాశము లేకపోవడము, యీనాడు అదృష్టవశాత్తు ఈ శాసనసభకు అధ్యక్షునిగా ఎన్నుకోబడడమువల్ల, అమ్మన్నరాజాగారి ద్వారా దీన్ని ప్రవేశ పెట్టడము జరిగింది. ఇప్పుడు ఇందులో చాలా సమంజసమైన విషయము ఏమిటంటే సంతానము ఉంటే ఏమిటో సంతానము కలిగిన తరువాత వుండే కష్ట సుఖములు ఏమిటో అవి అన్నీ అనుభవము లోనికి తీసుకొని ఆ అనుభవమును దృష్టిలో పెట్టుకుని చెప్పటానికి సంతానము లేనటువంటి మన కాళేశ్వరరావుగారి కంటె గూడ యీ సంతానమువల్ల కలిగే కష్టములు, అందులో ప్రత్యేకంగా ఆడపిల్లలు గలిగిన తరువాత వారు వాళ్ళ వివాహ సందర్భములో పడే కష్టములలో ఇరుక్కొని పోయిన మన అమ్మన్నరాజాగారు యీ బిల్లును ప్రవేశ పెట్టడము చాల సమంజసముగా వున్నది. ఇది నాయొక్క వ్యక్తిగత అభిప్రాయము. శ్రీ కల్లూరి సుబ్బారావుగారికి కలిగిన ఈ సందేహము నాకు కూడ లేకపోలేదు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—అటువంటి కష్టాలు రాకుండుగాక!

శ్రీ సి. శ్రీరాములు :—శ్రీ సుబ్బారావుగారు వెలువరచిన సందేహం నాకుకూడా లేకపోలేదు. కేవలం ఇది వరకట్నాలను నిషేధించే బిల్లుమాత్రం కాకుండా వుండాలి. స్నేహాలత వరకట్న నిషేధ సంఘంవారి పేరుతో పంచిపెట్టబడిన pamphlets చూశాము. ఒక విషయం తమ ద్వారా సభ దృష్టికి తీసుక రాదలచాను. "వరకట్న నిషేధ శాసనం చేయాలి; సంతలో పశువులవలె అమ్ముడుపోయే అలవాటును అరికట్టాలి" అన్నారు. సంతలో పశువులుంటాయి; పశువులలో కోడెలు, పెయ్యలు రెండూ వుంటాయి. కోడెలను మాత్రమే కొనేటటువంటి ఆచారం కాకుండా పెయ్యలకు శుల్కం అనే పేరుతో చెల్లించవలసిన అవసరం తల్లిదండ్రులకు లేకుండా చేయవలసిన అవసరం యీ బిల్లుద్వారా వుందని నా అభిప్రాయం. వరకట్నమే కాదు. ఆడపిల్లలను కన్న తల్లిదండ్రులకు తెలిసిన విషయం ఒకటున్నది. కొన్ని కులాలలో తమ కుమార్తెకు తగిన వరుని సంపాదించుకోవాలంటే కాబోయే అల్లుడికి consideration యిచ్చి వానిని సంపాదించుకోవడంలో అర్థం వుంది. కాని ఆ రూపేణా వరుని తోబుట్టువులకు యివ్వవలసిన లాంఛనాలుగా చెల్లించవలసిన మొత్తాలు అసలు కట్నాలకు అతిక్రమించి పోతున్నాయి. అందువల్ల కట్నాలకు, లాంఛనాలకు చెల్లించడానికి కొన్ని వేలు కావడం వల్ల కుటుంబాలు సర్వ నాశనం అవుతున్నాయి. అందుకు తీర్మానాలు చాలా లేకపోలేదు. అందువల్ల ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా, సంఘంలో వున్న ఈ దురాచారాన్ని నిషేధించడానికి సంఘలద్వారా నైతిక ప్రచారం ద్వారా మానసికంగా మార్పు తీసుకురావాలనే సదుద్దేశం సమాజంలో వున్నప్పటికీ శాశీరకంగా సాధ్యం కానటువంటి సందర్భంలోనే యీ చట్టాన్ని ప్రవేశపెట్ట వలసి రావడం చాలా సహజం. అయితే నాకుముందు మాట్లాడిన మిత్రులకు కలిగిన సందేహం నాకు కూడ లేకపోలేదు. ప్రభుత్వం ఏ చట్టం చేసినప్పటికీ దానిని పట్టుదలగా సర్వవిధాలా నూటికి నూరుపాళ్ళు అమలు చేయలేక పోవచ్చును. కాని కొంతవరకు కాకపోయినా కొంతవరకైనా దానిని అమలు చేయలేనటువంటి పరిస్థితులు వుంటే మాత్రం అది హాస్యాస్పదముగా కేవలం కాగిత రూపేణా చేసినటువంటి చట్టాలుగా మిగిలి పోతాయి

మధ్యపాన నిషేధ చట్టం అమలులో విఫలమైనదని చాలమంది ఒప్పుకోక తప్పదు. ఆ చట్టం అమలు జరిపిన విధంగా కాకుండా దీనిని సర్వవిధాలా అమలు జరుప గలమా లేదా అనే సందేహం సభ్యులకే కాదు ప్రభుత్వానికి కూడా తప్పకుండా వుంటుంది. అంత మాత్రాన ఊరుకోవడానికి వీలు లేదు. మిత్రులు శ్రీ సుందరయ్య, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగార్లు చెప్పినట్లు సందేహాలున్నప్పటికీ పూర్తి నమ్మకం లేక పోయినప్పటికీ కూడా ఇది సిగ్గుపడవలసిన విషయం కాబట్టి యీ చట్టాన్ని అడ్డం పెట్టుకొని ప్రచారం చేయవలసిన అవసరం కూడా వుంది. ఈ బిల్లును ప్రవేశ పెడుతూ శ్రీమతి అమ్మన్న రాజాగారు ఒక విషయం చెప్పారు. కుర్రవానికి ఎన్ని అర్హతలున్నా, అమ్మాయికి ఎన్ని అర్హతలున్నా ఆకారాలు చక్కగా వున్నా ఎంత చదువుకొన్నా ఎంతమంచి కుటుంబంలో పుట్టినా "కట్నంలేనిదే చేసుకోము" అనే ఆంక్ష పెట్టడం చాలా సిగ్గుచేటు. పిల్లవాడికి grade ల వారీగా కట్నాలున్నాయి. బి. ఏ. ప్యాసైతే యింత. బి. ఇ. కోర్సుకి సెలక్షను వస్తే యింతా, మెడికలు సీటు వస్తే యింత, ఆ సీట్లు సంపాదించడానికి వరకట్నాలివ్వడం, ఏ సీటు వస్తే ఎంత demand ఉండేది బాధపడతున్నవారికే తెలుసును. ఈ మధ్య జరిగిన సంఘటన తమకు చెప్పడానికి సాహసిస్తున్నాను. 70 వేల రూపాయలు వరకట్నం ఇవ్వడానికిన్నీ, తిరుచానూరులో పెండ్లి జరిపించడానికి ఏర్పరుచుకొన్నారు. ఒక condition పెట్టుకున్నారు. తిరుపతికి పెళ్ళి ముందుగానే ఆ 70 వేల రూపాయలు బెజవాడలోనో, గుంటూరులోనో, శ్రీకాకుళంలోనో, ఇండ్లదగ్గరనే చెల్లించిన తరువాత తిరుచనూరులో పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నారు. కాని పాపం, 40 వేల రూపాయలు మాత్రమే ఇక్కడ చెల్లించి తక్కిన 30 వేల రూపాయలకు తిరుపతిలో cheque ఇస్తాం అని షరతు పెట్టుకున్నారు. కాని వారి ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా అనుకున్న ప్రకారం తిరుపతిలో 30 వేల రూపాయలు cheque యివ్వలేని సందర్భం రావడం, ప్రామిసరీ నోటు వ్రాసి ఇస్తాం అని వారెంత ప్రాధేయ పడినప్పటికీ "నాలుగో తారీఖున పెట్టిన ముహూర్తాన్ని మరి రెండు రోజులు వాయిదా వేసి ఇక్కడ తిరుపతిలోనే వుండి ఆరవ తారీఖు సాయంత్రంలోపల cheque ఇచ్చినట్లయితే ఆరవ తారీఖుకు ముహూర్తం వాయిదా వేస్తాం" అని వాయిదా వేశారు. నానాకష్టాలు పడి 30 వేల రూపాయలకు cheque సంపాదించి cheque తెచ్చిఇస్తే జ్యోతిష్యులు పెట్టిన ముహూర్తం 4వ తేదీ నుండి 7వ తేదీకి మార్చడానికి జ్యోతిష్య శాస్త్రంలో అవకాశం ఏర్పడింది! ఏడవ తారీఖు సాయంత్రం పెండ్లి జరిగింది. ఈ శాసనం సరిగా అమలు జరగడానికి మనస్సులలో మార్పులు రావాలి. ఇదివరకు బాహాటంగా బల్లపై చేతులుపెట్టి కట్నం తీసుకునేవారు యీ శాసనంవల్ల బల్లక్రింద చేతులుపెట్టి రహస్యంగా కట్నం తీసుకునే అవసరం కలుగుతుందనే భయం చాలామందికి కలుగుతున్నది. ఇక్కడున్న స్త్రీ సభ్యురాండ్రలోనే ఏకాభిప్రాయం లేదు. ఈ బిల్లును సమర్థించుతూ మాట్లాడినప్పుడు హర్షధ్వానాలు చేసి ప్రతిఘటించినప్పుడు అడ్డుప్రశ్నలు వేయడం గమనిస్తున్నాను. వారిలో కూడా రెండు వర్గాలున్నాయి. ఒక వర్గం కేవలం మగపిల్లలను కన్నటువంటివారు స్త్రీ సభ్యురాండ్రు తటస్థంగా ఊరుకుంటున్నారు.

శ్రీమతి జయలక్ష్మీదేవమ్మ (ఆలంపూర్) :—లేదండీ, నేను కూడా పేరు పంపించాను. దయచేసి అట్లాంటివి అన్యాయంగా మాట్లాడ్డం బాగుండదు.

శ్రీ పి. శ్రీరాములు :—అయితే ఉపసంహరించుకోడానికి నాకు అభ్యంతరం లేదు.

శ్రీ డిప్యూటీ స్పీకరు :—వారు ఉపసంహరించుకున్నారు.

శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు :—వారు స్త్రీసభ్యురాండ్రు అన్నారు. పురుష సభ్యురాండ్రు కూడా ఎవరైనా వున్నారా?

శ్రీమతి పై. సీతాకుమారి :—అధ్యక్షా, పురుషులతో ఇంతవరకూ ఊరికే కూర్చున్న వారందరికీ అదే ఉద్దేశ్యమని అనుకోవచ్చునా?

శ్రీ పి. శ్రీరాములు :—అలా ఎప్పుడూ కాదు. స్త్రీ సభ్యులు అటువంటి అభ్యంతరం తీసుకుంటే ఉపసంహరించడానికి నాకు అభ్యంతరం లేదు. దీనిని అమలు జరుపడంలో practical methods అవలంబించాలని శ్రీ సుందరయ్యాగారు కొన్ని చక్కని సూచనలు యిచ్చారు. అవి సవరణ రూపంలో లేకపోయినా అనుభవరూపంలో లేకపోయినా అనుభవంలో సమర్థవంతంగా అమలు జరుపడానికి చేసిన సూచనలు కనుక వాటిని దృష్టిలో పెట్టుకొని యిది మార్పు చేయడానికి అవకాశం కల్పిస్తారని ఆశిస్తున్నాను. తరువాత చదువుకొనని అమ్మాయి పెండ్లిచేయడం కన్న చదువుకొన్న అమ్మాయి పెండ్లి చేయడమే ఎక్కువ కష్టంగా వుంది. సహజముగా బి. ఎ. ప్యాసైన కన్యకు సంబంధం కావాలంటే యం. ఏ ప్యాసయిన వరుడు వస్తేనేగాని యివ్వము అనే ఉద్దేశ్యము సహజంగా తల్లిదండ్రుల కుంటుంది ఆ కన్యకు కూడా "నాకన్న ఎక్కువ చదువుకున్నటువంటి వానినే చేసుకోవాలి. కాని నాకన్న తక్కువ చదువుకొని నాకు లొంగిన వానిని చేసుకోకూడదు" అనుకొంటుందని నా విశ్వాసము. ఈ శాసనం వల్ల ఆడపిల్లలను కన్న తల్లిదండ్రులు. ఆనందించనివారుండరని నా నమ్మకము. ఇదీ ఆంధ్ర ప్రదేశంలో యావన్మంది సంతోషించవలసిన బిల్లు. ఆంధ్ర ప్రదేశ్ శాసనసభలో ప్రతి విషయంపైన వాదోపవాదాలు జరిగి ఒకరౌనంటే మరొకరు కాదనే పార్టీలున్నప్పటికీ ఆడపిల్లలను కన్న తల్లిదండ్రుల కష్టాలను దృష్టిలో పెట్టుకొని అన్ని పార్టీలవారూ ఏకగ్రీవంగా యీ బిల్లును చేశారని ఆడపిల్లలనుకన్న తల్లిదండ్రులు ఆనందించవలసిన సమయం ఇది, ఈ బిల్లును సర్వ సమర్థనీయంగా రూపొందించి ఏకగ్రీవముగా పాస్ చేయాలని కోరుతూ దీనిని సమర్థిస్తున్నాను.

శ్రీమతి కె. కనకరత్నమ్మ (నరసంపేట) :—ఉపాధ్యక్షా, ఈ వరకట్న నిషేధపు బిల్లును శ్రీమతి అమ్మన్నరాజా ప్రతిపాదించినందుకు వారికి నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను. ఈ బిల్లుపై చాలామంది సోదరీమణులు, సోదర సభ్యులు క్షుణ్ణంగా విమర్శించి, చక్కగా మాట్లాడారు ఈ బిల్లుయొక్క ఆవశ్యకత గురించి మాట్లాడారు. తమ కష్టాలు నివారణ కావటానికి అతి త్వరలోనే ఈ చట్టం రావాలని స్త్రీ సభ్యులు కోరటము సహజమే. చట్టముకంటే ప్రచారము ముఖ్యమని శ్రీ నాగినేని వెంకయ్యగారు చెప్పారు. మహిళా సంఘములలో, ఆల్ ఇండియా వుమెన్స్ కాన్ఫరెన్సులో దీనిమీద చర్చ జరిగినమీదట భారతదేశం అంతట ఈ చట్టాన్ని అనువర్తింపజేయాలనే "స్లోగన్" పుట్టింది. ప్రతి పత్రికలోను, ప్రతి గ్రామములోను, ప్రతి పట్టణములోను తీవ్ర ప్రచారము జరిగినది. అది ఈనాడు కార్య రూపములోనికి రావటం స్త్రీలయొక్క వారి పిల్లల యొక్క అదృష్టమని నేను చెబుతున్నాను. ఈ వరకట్న నిషేధము మీద అనేకమంది నాటకాలు వ్రాశారు, సినిమాలు తీశారు. పూర్వకాలం క్రితమే

"వర విక్రయము" అనే సినిమా వచ్చింది. అందులో భానుమతి act చేసినట్లు నాకు గుర్తు వుంది. ఎన్నో సభలు ఏర్పాటు చేసి "కట్నాలు పుచ్చుకోకూడదు" అని ప్రచారము చేస్తున్న ప్పటికీ తీసుకుంటూనే వున్నారు. ఏనాడో ఇది పుట్టింది. ఇప్పుడు ఎందుకు దానిని మార్చటం అని సోదర సభ్యులు కొందరు ఎందుకు అంటున్నారో నాకు అర్థం కావటం లేదు. ఇది ఈనాడు పుట్టినది కాదు. ఎన్నో సంవత్సరాలనుండి మధ్యతరగతి కుటుంబములో వారి ఆక్రందన ఫలితమే ఈబిల్లు రాబోతున్నది. ధనవంతులు కట్నము ఇచ్చుకొంటే ఇచ్చుకోవచ్చు. చిన్న తరగతి వారికి వెనుక బడిన జాతులవారికి ఈ కట్నాల బాధలుండవు. తెలంగాణాలో ఒక చీరె, రవికె తీసుక వచ్చి పెళ్ళిళ్ళు జరుపుతారు. ఈ చట్టం వారికొరకు కాదు. వారి వారి స్థోమతను బట్టి భాగ్యవంతులు ఇచ్చుకుంటారు. అప్పులు చేసినా, ఆస్తులు అమ్ముకున్నవారు భాగ్యవంతులు కనుక వారి అవస్థ వారు పడుతారు. కాని అన్ని బాధలు మధ్యతరగతి ప్రజలకే అని, వారికే ఈ బిలు అవసరమని నేను చెబుతున్నాను. ఒక చిన్న ఉద్యోగస్తునికి ఎక్కువ మంది ఆడపిల్లలు వుంటే వారికి పెండ్లి చేయాలంటే డబ్బు కొరకు ఏవో మార్గాలు అనుసరించ వలసి వస్తుంది. "కరప్షన్", ఎక్కువ అవుతుంది. ఇటువంటి చట్టము తీసుకువస్తే పిల్లల పెండ్లికొరకు కట్నాల బాధను తొలగించుకోటానికి బాధపడవలసిన అవసరం వుండదు. అటువంటి కుటుంబములకు ఈ చట్టం చేయటం ద్వారా సహాయము చేసినవారము అవుతాము. తల్లిదండ్రులు సంతోషిస్తారు. శిక్ష విషయములో కొన్ని మార్పులు చేస్తే చేయవచ్చు. దానిని ఆమోదించటానికి సిద్ధముగా వున్నాము. నేను దీనిని బలపరుస్తూ మీరంతా support చేస్తారని భావిస్తున్నాను. తెలంగాణాలో శారదా బిల్లు లేదు. ఆంధ్రరాష్ట్రములోనే వున్నది. ఇక్కడ చాలా చిన్న వయస్సులో వున్న పిల్లలకుకూడా పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి కనుక ఆ బిల్లును ఇచ్చటకూడా అమలులోనికి తీసుకురావాలని తమదృష్టికి తీసుకు వస్తున్నాను. ఇదివరకు ఇచ్చట హోళీ పండుగనాడు రంగులు వేసుకునే అలవాటు వుండేది. అలా వేసుకోవటం సభ్యత కాదని ఒక చట్టం తీసుకు వచ్చి బజార్లలో వేసుకోకుండా చేశారు. ఆంధ్రలో శారదా బిల్లు వచ్చినప్పుడు ఎర్రుపాలెములో పెళ్ళిళ్ళు జరిపేవారు. మేళాలు దొరకటం కష్టం అవుతే గ్రామఫోనులో బ్యాండు మేళం రికార్డులు వేసి పెండ్లిచేసేవారు. బెంగాల్‌లో స్త్రీలు ఈ వరకట్నబాధ భరించ లేక ఉరివేసుకుని మరణించినట్లు మనము పేపర్లలో చూస్తున్నాము. అటువంటి బాధలను తొలగించటానికి అందరు సహృదయంతో ఆలోచించి ఈ బిల్లును పాస్ చేయించ వలసినదిగా నేను కోరుతూ ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

శ్రీమతి ఎ. కమలాదేవి (ఆలేరు):—ఉపాధ్యక్షా, ఆంధ్రరాష్ట్రములో ఈ బిల్లును శ్రీ కాళేశ్వరరావుగారు ప్రవేశ పెట్టినారు. ఈనాడు అది ఆంధ్ర ప్రదేశమంతటా రావటం చాలా సంతోషం. నేను దానిని బలపరుస్తున్నాను. ఆర్థిక, రాజకీయ మార్పులు వచ్చినప్పుడే సాంఘిక మార్పులు వస్తాయని అనుకొనేవారు వున్నారు. వారు ఆ విధంగా అనుకోవడం పొరపాటు. చట్టంచేసి, ప్రచారంద్వారా ప్రజలలో మార్పు తీసుకురావటానికి ప్రయత్నం చేయాలి. చట్టం లేకుండా ప్రచారము చేయుట వలన ప్రయోజనము లేదు. చట్టం అనేది ఒకటి వుండాలి చట్టములో లోపము వుంటే సుందరయ్యగారు చెప్పినట్లు సవరణలు చేయవచ్చును. అంతేగాని చట్టమే అవసరములేదని వాదించటము సరైనది కాదు. రాజారామమోహన్‌రాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు గారు సాంఘిక మార్పులు తీసుకు వచ్చారు. వారు చేసిన బ్రహ్మాండమైన

కృషిని ఈనాటివరకు మనము మరవలేదు. సాంఘికమైన మార్పులు రావాలంటే ప్రచారముతో పాటు అసంబ్లీలో చట్టము చేయటము కూడా అవసరమే. కొంతమంది సభ్యులు 'పిల్లలులేనివారే support చేస్తున్నారు' అని చెప్పారు. పిల్లలు వున్నారా లేదా అనేది సమస్య కాదు. దేశంలో వున్న ప్రజలందరికీ మేలు కల్గించాలని అసంబ్లీలో ప్రమాణం చేయవచ్చు. మధ్య తరగతి నుండి పై వరకు ఈ కట్నాల సంఖ్య పెరిగి పోతున్నది. తల్లి దండ్రులు తమ పిల్లలను తమకంటె పై అంతస్తు గలవారికి ఇవ్వాలని అనుకోవటము కారణము కావచ్చు. ఆడపిల్ల పుట్టింది అనే వార్త వినగానే ఏడుపు ప్రారంభిస్తారు. ఆమె పెరుగుతున్నా, చదువు కొంటున్నా తల్లిదండ్రులకు దిగులు. ఆమెకు బి. ఎ. వరకు చెప్పించినప్పటికీ కట్నం లేకుండా పెళ్ళి జరగటము లేదు. పురుషుడు స్త్రీ సమానంగా చదువుకొన్నా 10 వేలు ఇస్తేగాని ఆమెకు భర్త లభించడు. ఆస్తి అమ్మి చదువు చెప్పించినా, కట్నం లేకుండా ఆమెకు పెళ్ళిచేసే పరిస్థితులు ఈనాడు లేవు.

దీనికి తల్లిదండ్రులు కూడా కొంతవరకూ కారణం కావచ్చు. వారికి ఉన్న ఆస్థిలో మొదటి నుంచీ స్త్రీలకు భాగం కల్పించలేదు. పార్లమెంటులో ఈ బిల్లు పాస్ అయినా కూడా పురుషునికి రూపాయి వంతు ఆస్తి వుంటే స్త్రీకి అందులో నయా పైస వంతైనా లేదు. ఈ విషయంలో చాలా అన్యాయం జరిగింది. తమకున్న ఆస్థిలో తమతో సమాన హక్కులు స్త్రీకి కూడా కల్గించాలనే మార్పు ఈనాటి సమాజంలో యింకా కలుగలేదు. అందువల్ల వెంకయ్యగారు చెప్పినట్లుగా చట్టమునే వ్యతిరేకించడం సమంజసం గాదు. చట్టం కావాలి. దాని ద్వారా స్త్రీలకు హక్కులు కలిగించాలి దేశంలోని ప్రతివారు ఈ విషయాన్ని సరిగా ఆలోచించినప్పుడు తగిన మార్పులు వస్తాయి.

విద్యార్థుల తల్లిదండ్రులే ఈనాడు ఎక్కువ కట్నాలు కావాలని కోరుతున్నారు. మేము ఆస్తి నంతా అమ్మి, మా అబ్బాయికి చదువు చెప్పించాము. ఆలోటును పూర్తిచేసు కోడానికి అమ్మాయి దగ్గర నుంచి మాకు ఆస్తి కావాలి అంటున్నారు. అయితే, విద్యార్థితన అభివృద్ధి కొరకు, తను ఎక్కువ సంపాదించుకొందామని, తన అంతస్తును యింకా పెంచుకుందామని చదివినాడు. అతను చదివినందువల్ల పిల్లకు జరిగేదేమీలేదు. అతను సంపాదించుకుంటే యిద్దరూ సమానంగా తింటారు. ఈ విషయాన్ని తెలుసుకుంటే ఏ తల్లి దండ్రులు కూడా "మేము ఆస్తి అమ్మినాము కాబట్టి ఆ ఆస్తి పట్టుకునే అమ్మాయి మా యింటికి రావాలి" అని అంటారు. ఈనాడు కట్నం విషయమై కొందరిని మందలిస్తే "నేను కట్నం లేకుండా పెండ్లి చేసుకుంటాను, కాని ప్రభుత్వంలో మాకు ముందుగా ఉద్యోగం యిచ్చే హామీ యివ్వమనండి" అంటారు ? ఆ విధంగా ఉద్యోగాలు కోరడం కూడా జరుగుతున్నది. ఆడపిల్లలకు చదువు చెప్పించిన తల్లిదండ్రులు కూడా బాధలుపడే ఉదాహరణ లున్నాయి. పెద్ద చదువు చెప్పించినా ఆస్తి కట్నం యివ్వకుండా పెళ్ళి జరగటంలేదు. ఇది స్త్రీలకు సంబంధించిన విషయం, స్త్రీలే ప్రచారం చేయాలి అనే విధంగా నేటి రాజకీయ పార్టీలు ఉన్నాయి. కాని స్త్రీలు మహిళా సంఘాలలో తీర్మానం చేశారు. ప్రచారం చేస్తూనే ఉన్నారు.

తెలంగాణాలో లేదనుకోండి, కాని ఆంధ్రరాష్ట్రంలో ఊరూరా ప్రచారంచేసి, మెమోరాండాలు పంపించారు. ఈనాడు ఏ కొద్దిమందో స్త్రీలో బయటకువచ్చి పనిచేస్తున్నారు, కాని చాలామంది ఇళ్ళలోనే కూర్చుంటున్నారు. సాధారణంగా పురుషునిపైననే ఎక్కువ బాధ్యత

ఉంటుంది. కష్టపడి సంపాదించో, లేక అప్పు తెచ్చో ఏదైనా తాకట్టుపెట్టో అవసరాలను బాధ్యతతో నెరవేర్చుకోవలసిన వాడు పురుషుడు. అందువల్ల పురుషునిపైన కూడా ఎక్కువ బాధ్యతే ఉంటుంది. స్త్రీలో ప్రచారంచేసుకోవాలి బాధ్యత అంతా వారిదేనని చాలామంది గౌ. సభ్యులు చెప్పడం చాలా విచారకరం. చాలా సిగ్గుకూడాను. స్త్రీలకు కూడా పురుషులతో సమానమైన హక్కులు యివ్వాలి, సమానంగా ముందుకు పోవాలి అనే సమయంలో వీరే ప్రచారం చేయాలి అని స్త్రీల మీద పెట్టడం సబబుకాదు.

స్త్రీల దగ్గర చాలా డబ్బు ఉంటుంది, ఆస్తి అంతా నగల రూపంలో దగ్గర పెట్టుకొని కూర్చుంటున్నారు, అని కొంతమంది గౌ. సభ్యులు చెప్పారు. కాని తెలంగాణాలో అట్లాలేద స్త్రీకి ఎంత బంగారం ఉన్నా అది స్త్రీ సొమ్ము కానే కాదు. భర్త చనిపోయిన తరువాతనే ఆ ఆస్తి భార్యకు చెందుతుంది. అంతవరకూ అందులోనుంచి ఏ మాత్రము కూడా ఖర్చు చేసుకొనే హక్కు స్త్రీకి లేదు. అదంతా పురుషుని అధికారంపైనే ఉంటుంది. ఇంకా ఈ చట్టంలో చాలా మార్పులు రావాలి. ఈ బిల్లు ప్రయపేటుగానే అమ్మన్నరాజాగారు ప్రతిపాదించారు ఇందులోని లోపాలను మార్పుచేయాలి. ఇందులో కట్నం యిచ్చినవారికి, పుచ్చుకున్నవారికి కూడా శిక్ష విధించాలని ఉన్నది. కాని పిల్ల తండ్రి తనపై నున్న భారాన్ని తీర్చుకోడానికి చాటుగా కట్నం యిస్తాడు. అందువల్ల కట్నం తీసుకున్నవారికి శిక్ష విధించాలి. ఈ బిల్లులో 1,000 రూ.ల శిక్ష అని ఉన్నది. అంత మాత్రం చాలదు. 10,000 రూ.లు కట్నం తీసుకునేవారు వెయ్యి రూపాయలు శిక్ష ఉంటే చెల్లించగలడు. ఇంకా 9 వేలు మిగులుతాయి. అందు వల్ల 20 వేలు, 10 వేల కట్నం తీసుకొనేవారికి వెయ్యి రూపాయలు శిక్ష వేయడంవల్ల లాభం లేదు. దీని విషయమై జాగ్రత్తగా ఆలోచించాలి. ఖైదు శిక్ష వేయాలని నా ఉద్దేశ్యం. అట్లా చేస్తే కొంతవరకూ మార్పువస్తుంది. ఈ చట్టంలో యింకా కొన్ని లోపాలున్నాయి. వాటన్నింటినీ మార్పుచేయాలి. శారదా చట్టం చేసినప్పుడు కూడా చట్టం వచ్చినా లాభం కలుగ దని మనం అనుకున్నాము. ఆంధ్రనుంచి పిల్లలను తీసుకొచ్చి నైజాములో పెళ్ళి చేశారు. అది క్రమేపి మార్పు జరిగింది. ఇప్పుడు ఈ చట్టం చేసిన తరువాత కూడా దొంగతనంగా కట్నాలు యిచ్చే అవకాశం ఉంటుంది. చాటుగా యిస్తారు. చట్టం తరువాత క్రమేపి మార్పులు వస్తవి. ప్రతివారు కూడా వారి అమ్మాయిలకు చదువుచెప్పించి, వారు సంపాయించుకొని, పొట్టపోసుకొనేందుకు శక్తిగలవారు గాచేయాలి. ఈనాడు మగ పిల్లలకు చదువు చెప్పించడానికి, తరువాత ఉద్యోగాలు సంపాదించుకోడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. అట్లాగే ఆడపిల్లల విషయంలో కూడా చేయాలి. వారికి యిష్టం వచ్చినవారినే పెళ్ళిచేసుకునే అవకాశం కలుగ చేయాలి. అమ్మాయిని కూడా అబ్బాయితో సమానంగా చూడాలి. సమానంగా చూసే పద్ధతి ఈనాడు సంఘంలో లేదు. కొడుకులతో సమానంగా కూతుళ్ళను కూడా చూచేందుక యత్నించాలి.

అన్ని విషయాలలోనూ స్త్రీలకు పురుషులతోబాటు సమానావకాశాలు కలిగించాలి. ఈ చట్టాన్ని ఎవ్వరూ వ్యతిరేకించకూడదు. **Prohibition Act** వలెనే ఇది కూడా జరుగుతుందని కొంతమంది అభిప్రాయ పడుతున్నారు. చట్టంచేసినంత మాత్రాన పనులు జరుగవు ప్రచారంకావాలి. ఈ శాసన సభలోని 300 మంది గౌ. సభ్యులలో ఇద్దరు ముగ్గురికి తప్ప మిగిలిన

వారికి పిల్లలుంటారు. వారంతా తమ పిల్లలకు కట్నం ఇవ్వమని, అబ్బాయిలకు కట్నాలు తీసుకోమని ప్రమాణాలు చేయాలి. అట్లాచేస్తే 300 మంది పిల్లలను రక్షించిన వారౌతారు. శాసన సభ్యులు ముందుకువచ్చి చేసినట్లయితే, విద్యార్థులు ప్రజలూ ఆచరిస్తారు. విద్యార్థులను నిందించినంతమాత్రాన పని జరగదు. అంగడిలోని సరుకులవలె ఈనాటి విద్యార్థులు అమ్ముడు పోవడానికి కారణం ఏమిటి? మనం అంగట్లోని సరుకులను కొనితెచ్చి ఉపయోగించు కుంటాము. అవి మన అదుపులో ఉండాలి. కాని అమ్మాయికి ఎంతకట్నం ఇచ్చినా ఆమె భర్త చెప్పినట్లే నడచుకోవాలి. భర్తమాత్రం భార్యచెప్పినమాట వినడు. కట్నం ఇచ్చినా, ఆ అమ్మాయికి ఆ ఇంట్లో గౌరవం లేదు, ఆమె మాట చెల్లదు.

అందువల్ల ఆడవారికి కూడా చదువు చెప్పించి తమ స్వంతకాళ్ళపై నిలబడేటట్లుగా చేయాలి. తలిదండ్రులు ఉదారభావంతో తమ కొడుకులతోపాటు కూతుళ్ళకు కూడా చదువులు చెప్పించాలి, చట్టాన్ని అమలు చేయాలి. కాని అబ్బాయిలు లేనివారు support చేస్తున్నారు ఉన్నవారు support చేయడంలేదు అనేమాటలవల్ల ప్రయోజనంలేదు. అమ్మన్న రాజా. గారికి అమ్మాయి ఉండవచ్చు, కాళేశ్వరరావుగారికి పిల్లలు లేకపోవచ్చు, పిల్లలున్నారా లేదా అనేది ఇప్పటి సమస్యకాదు. ఇప్పుడా చట్టం తెస్తున్నాము. అమలులో పెట్టాలి. అసలు పభుత్వమే ఈ చట్టాన్ని తీసుకురావాలి. ప్రభుత్వం తీసుకురాలేదు, ప్రయివేటుగా వచ్చింది. అయినా దీనిని అందరూ అంగీకరించాలి. ఇప్పటికే చాలా ఆలస్యమైనది. కాబట్టి అవసరమైతే తరువాత సవరించుకోవచ్చును. కాని దీనిని ఎవ్వరూ వ్యతిరేకించకుండా అందరూ support చేయాలని, ఈ సమావేశంలోనే pass చేయాలని నేను కోరుతున్నాను.

శ్రీ పి. వి. నరసింహారావు (మంధని):—అధ్యక్షా, దాదాపు 50 సంవత్సరములనుంచి భారత దేశమంతటా సంఘసంస్కర్తలు ఆందోళనలు చేస్తున్నప్పటికీ హిందూ సమాజానికి ఇంత వరకూ సమగ్రమైన ఒక శాసనం లభించక పోవడం ఎంతో శోచనీయం. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత దీనిని గురించి ఒక సమగ్రమైన శాసనాన్ని తేవాలనుకున్నాము, తేబోతున్నామని మన నాయకులు కూడా ఉద్ఘాటించారు. కాని, ఆచరణలో కొన్ని ఇబ్బందులు రావడంవల్ల ఇదీ ఖండఖండాలుగా తేవడం జరుగుతోంది. ఇంతవరకూ భారత పార్లమెంటులో దానికి సంబంధించిన కొన్ని విషయాలు మాత్రమే శాసన రూపాన్ని ధరించాయి. హిందూ ధర్మ శాస్త్రింలో ఆచారకాండ, వ్యవహారకాండ యని రెండు భాగాలుగా విభాగించడానికి అవకాశ మున్నది. ఈనాడు ఈ సభముందు ఉన్నటువంటి బిల్లు ఆచార వ్యవహారకాండాలకు రెండింటికీ సంబంధించినది. అయితే హిందూ వివాహ చట్టంలో దీనికి స్థానం కల్పించడానికి ఎందుకు అవకాశం లేకపోయిందో నాకు దురూహ్యంగా ఉన్నది. Marriage and Divorce Act వచ్చినప్పుడు marriage కి సంబంధించిన, వరకట్నాలు, కన్యాశుల్కాలు కూడా నిషేధిస్తూ ఏర్పాటు చేసివున్నట్లయితే వేరువేరు శాస్త్రాలలో వేరువేరు చట్టాలు తెచ్చే అవసరం లేకపోయేదేమోనని నేను భావిస్తున్నాను.

ఇదీ ఒక అనధికార బిల్లు స్వరూపంతో మనముందుకు వచ్చినది. దీనిని మనము ఈ నాడు ఆలోచిస్తున్నాము. ఇంతకుముందు చాలామంది మంత్రులు ఈ వరకట్నాలు ఇవ్వడం విషయంలో తమ తమ అభిప్రాయాలు వ్యక్తపరచినారు. ఏ సంఘంలో అయినప్పటికీ ఏ ఆచార

పైనా సంఘానికి నష్టము కలిగించేదిగా మొట్టమొదట ఏర్పాటు చేయబడదు. ఒక కాలంలో సంఘానికి ఏదో ఒక విధంగా ఆ ఆచారం అవసరమై ఉండడంవల్లనే అది ఆచరణలో ఉండడం సంభవిస్తుంది. అయితే కాలక్రమేణా సంఘంలో ఉండే శక్తులు ఆ ఆచారంలో ఇప్పుడున్న సూత్రాన్ని వాడుకోవడం ప్రారంభిస్తే ఆ ఆచారం వల్ల సంఘానికి నష్టమే వాటిల్లుతుంది. అటువంటి పరిస్థితులలో ఆ ఆచారాన్ని సంస్కరించవలసిన అవసరం ఏర్పడుతుంది. ఇది ఒక Continuous process నిర్దుష్టమైన ఆచారం అంటూ కాని శాసనం అంటూకాని యీ ప్రపంచంలో ఒకటి ఉండబోదు. ఆ యీ కాలాలకు అనుగుణంగా ఆచారాలు, శాసనాలు మారుతూ ఉంటాయి. మారుతూ ఉండాలి కూడా, లేకపోయి నట్లయితే సంఘంలో ఒక విధమైన స్థబ్దత ఏర్పడుతుంది. సంఘం వెనుకబడి పోతుంది. సంఘం హీనస్థితికి వస్తుంది. మన హిందూసమాజం యీనాడు కొంతవరకు అట్టి స్థితికి వచ్చినదని చెప్పటకు విచారిస్తున్నాను. అట్టి పరిస్థితులను మార్పు చేయడానికి ఇటువంటి బిల్లులు కొంత వరకు అవసరమేమో కూడా. అసలు ప్రపంచములో ఉన్నటువంటి అన్ని దేశములలో కూడా అక్కడి సంఘమును అభివృద్ధికి వచ్చి వికాసాన్ని పొందేవరకు కూడా స్త్రీకి చాలావరకు హక్కులు ఇవ్వడం జరుగలేదు. ప్రప్రథమముగా స్త్రీకి సమాన హక్కులు ఇవ్వడం సమాన అవకాశాలు ఇవ్వడం జరుగలేదు. అది తరువాత జరిగిన పని. అరేబియా దేశంలో ఆడపిల్ల జన్మిస్తే ఆ పిల్లను జననమయినవెంటనే పాతి పెట్టేవారని మనకు తెలుస్తూన్నది. అక్కడ ఇస్లాం మతము రాకముందుండిన ఆచారమది. కాని తరువాత మహమ్మదీయులలో స్త్రీలకు కూడా హక్కు కలిగేటట్లు చేయడం జరిగింది. స్త్రీని మొట్టమొదట ఒక ఛాటల్ క్రింద భావించడం జరుగుతూ ఉండేది. కాబట్టి ఒక పీడ వదలించుకునేటట్లుగా చూడబడ తూండేది.

స్త్రీని పరిగ్రహించుటకు కొంత డబ్బు వేయిరూపాయలో 10 వేలరూపాయలో ఎంతో కొంత—ఇచ్చినట్లయితే ఆ డబ్బుకు ఆశపడి ఆ అమ్మాయిని పరిగ్రహించేటట్లు చేయవలెననే ఒక పద్ధతి మన దేశంలో మన సంఘంలో ఉన్నది. కాని ఈ శాసనము వచ్చిన తరువాత అనుకూల వాతావరణం ఏర్పడితే ఆచారం మారవచ్చు. సాంఘికంగానూ, ఆర్థికంగానూ మనం ఎన్నో మార్పులు తీసుకొని వస్తున్నందువల్ల మన సంఘం లో ఉన్నటువంటి వర్ణ విభేదాలు క్రమ క్రమముగా అంతరిస్తున్నాయి. మన దేశంలో ఎన్నో వర్గములు ఉండడంవల్ల ఒక వర్గము వారు తమ పై వర్గం వారికి తమ పిల్లను ఇవ్వవలె, ఆ వర్గముతో సంబంధము కల్పించుకోవలె తాము కూడా పై వర్గానికి చెందిన వారమని అనిపించుకోవలెననే కోరికవల్ల ఈ వరకట్నములు ఇస్తున్నారు. ఇంతకు ముందు చెప్పిన మిత్రుల తో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అయితే యీ నాడు ఆ వర్గములు చాలవరకు తక్కువయ్యే నిమిత్తం మనము ఏ సోషలిస్టు సమాజమును స్థాపించటానికి ప్రయత్నించేస్తున్నామో, ఆ ప్రయత్నాల దృష్ట్యా దురాచారము పోగలదని ఆశిస్తున్నాను. కాని అటువంటి ప్రయత్నములు హృదయపూర్వకంగా జరుగకపోతే కేవలం యీ బిల్లువలన యీ దురాచారం పోతుందని నేను నమ్మను. అటువంటి ప్రయత్నము వల్ల మన సమాజములో వచ్చే ఆమూలాగ్రమయిన పరివర్తనల దృష్ట్యా యీ శాసనం తప్పక అమలు జరగడానికి ఎంతో అస్కారం ఏర్పడగలదని నమ్ముతున్నాను.

అంతేకాక కులాలు, మతాలు, వర్గాలువంటి బారియర్సు ఉండడంవల్ల అమ్మాయిలు ఉన్న తల్లిదండ్రులకు ఛాయిస్ ఎక్కువగా లేకుండా పోతున్నది. తన కులములో, తన వర్గములో

బిడ్డలకు సంబంధములు చేయవలెనసే ఆచారం ఉండడంవల్ల తల్లితండ్రులకు చాయిస్ ఎక్కువ లేకపోవడం యీనాడు వరకట్నాలు ఈయవలసిన పరిస్థితులకు దారితీస్తున్నదని మనవి చేస్తున్నాను. మనము ఇప్పుడు కులమత వర్గరహితమయిన సమాజాన్ని ఏర్పరచుకోవాలని అనుకుంటున్నాము. అయితే అది పూర్తిగా సాధించుకోగలిగినామని నేను అనను. అయితే అట్టి సంఘ నిర్మాణం నిమిత్తం మనం చేస్తున్న ప్రయత్నములు ఫలోన్ముఖం కాగలవని ఆశిస్తున్నాను. అట్టిపరిస్థితులలో యీ శాసనం సమంజసమైనదని, అమలు పరచ సాధ్యము అగునని నేను నమ్ముతున్నాను. యీ శాసనం అమలు జరుగుతుందా లేదా అనే మీమాంస తెచ్చేబదులు ఇది ఒక అవసరమైన మోషన్ అని, సాంఘికముగా దీని అవసరమున్నదని మనము గుర్తించవలసియున్నది. దీనిని బహుళ ప్రయోజన సందేహములు వెలిబుచ్చడం సమంజసమైన విషయంకాదని నేను మనవి చేస్తున్నాను. యీనాడు ఆస్తిపైన అందరకు కోరిక, క్రేజ్ ఉన్నది. ఆంధ్ర ప్రాంతములలోని పరిస్థితులు నాకు సరిగా తెలియవుగాని, తెలంగాణా ప్రాంతములో యీ క్రేజ్ చాలా ఉన్నది. అమ్మాయిని ఇవ్వాలంటే మొట్టమొదట చూచేది ఆస్తి. విద్యావంతుడైన అల్లుడు ఆస్తి ఉన్నా లేకున్నా తన భార్యను పోషించుకుంటాడు అనే నమ్మకము ఇంకను తెలంగాణా లోని తల్లి తండ్రులకు కలగలేదని నేను అనుకొంటున్నాను. నాకు తెలిసినంతవరకు తెలంగాణాలో సాంఘిక పరిస్థితి ఇది. చదువుమీద కన్న ఆస్తిమీద క్రేజ్ చాలా ఉన్నది. ఆస్తిపైన కాంక్ష తగ్గవలసిన అవసరం ఉన్న మనము చేస్తున్న భూ సంస్కరణలవల్ల, ఇతర శాసనములవల్ల ఈ క్రేజ్ చాలావరకు తగ్గే అవకాశములు ఉన్నాయి. శాసనములను ఏలా ఉల్లంఘించాలో, వాటిలోని లోపాలు ఎలా చూడాలో, వాటి ప్రభావం తమ ఆస్తులమీద పడకుండా ఎలా చూచుకోవాలో జమీందారులు ఇతర భూ స్వాములు చూచుకుంటూనే ఉన్నారు. అయినప్పటికి ఆ శాసనములు చాలావరకు అమలు జరుగుతున్నాయి. వాటియొక్క పరిణామములు సంఘంలో రాబోతున్నాయి. ఎవరూ దాటుకోలేని పరిస్థితి రాబోతున్నది. సంఘంలో ఉన్న 'వరకట్న' 'కన్యాశుల్క' దురాచారాలు లేకుండా పోయే పరిస్థితి వస్తుందని నేను optimistic గా భావిస్తున్నాను, కాబట్టి వీలయినంత త్వరలో బిల్లును మనము పాస్ చేయవలెనవి కోరుతున్నాను.

ఇంతకుముందు ఒక గౌరవ సభ్యురాలు తెలంగాణాలో చైల్డ్ మ్యారేజి రెస్ట్రెయింట్ యాక్టు అమలులో లేదని అన్నారు. అది నిజమైన పరిస్థితికాదు. ఏనాడు స్వతంత్ర్యం వచ్చినదో ఆనాడే హైదరాబాదు స్టేట్‌లో Child Marriage Restraint Act తో సహా శాసనాలన్నీ అమలులోనికి వచ్చాయి. Indian Penal Code, Criminal Procedure Code మొదలైన శాసనములన్నీ హైదరాబాదుకు అనాడే వర్తింపచేయడం జరిగింది. కాని Child Marriage Restraint Act ఇక్కడ సరిగా అమలు జరుగుటలేదని కూడా ఒప్పుకుంటున్నాను. దానికి ముఖ్యకారణం దానిలో ప్రభుత్వానికి సరిఅయిన అధికారాలు లేవు. మనము శాసనము చేసినా దానిని ఎన్‌ఫోర్సు చేయడానికి సరిఅయిన అధికారాలు ఇవ్వలేదు. Child marriage ని cognizable offence గా చేయలేదు. ఫలానా మనిషి కంప్లేంట్ చేస్తేనే చర్య తీసుకొంటాము కాని లేకపోతే లేదు అని చెప్పడంవల్ల యీ శాసనం సరిగా అమలు జరుగుటలేదు.

ఈ విధంగా చేయదలచుకొంటే యిది సరైన పద్ధతి కాదని మనవి చేస్తున్నాను. బ్రిటిష్ ప్రభుత్వం ఉన్నప్పుడు వారు భారత దేశీయుల యొక్క Personal Laws లో ఎప్పుడూ

interfere కాలేదు. Interfere అయినప్పుడు చాలా గట్టిగా అయ్యేవారు. అందుకనే వారు ఏ శాసనం చేసినా గట్టిగా అమలు జరిగేది. ఈ నాడు కూడ ప్రభుత్వం interfere అవుతున్నారు. కాని దానిని అమలు జరిపే విషయంలో, ఆ మనిషివచ్చి complaint చేస్తేనే చర్య తీసుకొంటామని, లేకపోతే లేదని అంటున్నారు. ఇది non-cognizable అని, imprisonment అవసరం లేదని—అంటే ఏమిటి? 50 వేలు వరకట్నం వస్తే అందులోనుంచి ఒక వెయ్యి రూపాయలు జరిమానా చెల్లించుకోమని చెప్పటం అన్నమాట. ఇది చాలా సులభం, దీనివల్ల ఈ శాసనం అమలుకాదు. అందువలన తప్పకుండా imprisonment అనే శిక్ష ఉండి తీరాలని మనవి చేస్తున్నాను. ఈశాసనం పాస్ అయిన తరువాత ప్రారంభంలో బలవంతంగా, coarse వాతావరణంలో నైనా అమలు పెట్టవలసి యుంటుంది, కొన్ని deterrent punishments యివ్వవలసి యుంటుంది. మనకు ఎంత కష్టమనిపించినా కొన్ని కేసులలో action తీసుకొనవలసిన అవసరం ఉంటుంది. అట్లా చేసినప్పుడు, నెమ్మదిగా ఒక సక్రమ వాతావరణం ఏర్పడుతుంది. సంఘంలో యిది దురాచారం నీతి బాహ్యం, చట్ట రీత్యా నిషేధమైనదని తెలిసేవరకు ఆచరణ రూపేణా చర్యలు తీసుకొనవలసి యుంటుంది. కాబట్టి దీనిని cognizable చేయమని, తప్పకుండా imprisonment ఉంచమని, కనీసం ప్రారంభ దశలో గట్టిగా దీనిని అమలుజరిపే ప్రయత్నాలు చేయాలని అభిప్రాయపడుతూ విరమిస్తున్నాను.

శ్రీ ఎ. బాపినీడు (కొవ్వూరు—జనరల్) :—అధ్యక్షా, ఈ వరకట్న నిషేధ బిల్లు, సాంఘిక విషయమునకు సంబంధించినది, కనుక ఆచరణలో పెట్టే విషయం సాధ్యంకాదు కాబట్టి, దీనిని చట్ట రీత్యా పాస్ చేయటానికి నేను ఎంత మాత్రం సమ్మతించను. ఇదికేవలం సాంఘిక విషయం దీనికి దురాచారం అనే కలర్ యిచ్చి శాసనం చేయాలని ఉద్దేశించటం సమంజసం కాదు వరకట్నం అనే విషయం రెండు విధాలుగా పూర్వంనుంచి ఉన్నది. పిల్లను యిచ్చేటప్పుడు డబ్బు పుచ్చుకునేవారు ఉన్నారు. అయితే యిదికేవలం అమ్ముకునే విషయంకాదు. తన కొడుకులతో బాటు కూతుళ్ళకు సమానంగా ఏదైనా డబ్బు రూపకంగా యివ్వడమనేది—దురాచారం అంటున్నారు. ఇది ఎట్లా దురాచారం అవుతుందో నాకు అర్థంకావడం లేదు మను వ్రాసిన హిందూ ధర్మశాస్త్ర ప్రకారం తమ కొడుకులతో పాటు, కూతుళ్ళకు ఆస్తిలో వాటా లేదు కనుక, తమ ఆడపిల్లలు భర్తల ఇండ్లకు వెళ్ళి కాపురం చేయవలసిన సంఘ ఆచారం ఉన్నది కాబట్టి కట్నాల రూపంలో కొంత నగదుగానో, వేరే రూపంగానో, ఆడపిల్లలకు యివ్వడం ఆచారం అయినది. హిందూ ధర్మశాస్త్ర ప్రకారం ఉన్న హిందూ జాయింట్ ఫామిలీ split up చేసి, మహమ్మదీయులలో వలె ఆడపిల్లలకు కూడ వాటాలు యిస్తే, మహమ్మదీయ కుటుంబాలు ఎంత వృద్ధిలోకి వచ్చాయో గుర్తులో పెట్టుకొనండి. చరిత్రయే చెపుతున్నది. నేను చెప్పనక్కరలేదు. రానురాను చరిత్ర మారిపోతున్నది. ఆడవాళ్ళకు కూడ వాటాలు యిచ్చే పద్ధతి అమలులోకి వస్తున్నది. కాబట్టి యిది దురాచారం క్రింద ఎట్లా వస్తుందో నాకు తెలియడం లేదు. పూర్వం మనువు హిందూ ధర్మశాస్త్రం వ్రాసినప్పుడు—స్త్రీ పుట్టగానే, ఆమె మన వస్తువుకాదు, మన సొత్తుకాదు, పరాయి యింటికి వెళ్ళవలసినదేనని...

శ్రీమతి టి. లక్ష్మీకాంతమ్మ :—స్త్రీ 'వస్తువు' అనే పదానికి object చేస్తున్నాను.

శ్రీ ఎ. బాపినీడు :—నేను, జరిగే విషయానికి విరుద్ధముగా చెప్పుటలేదు. స్త్రీ, భర్త వద్దకు వెళ్ళి కాపురం చేయుట ఆచారం. దానిని ఎవరూ కాదనలేరు. శ్రీ రాజారామమోహన్ రాయ్, కేషబ్ చంద్రసేన్ వీరంతా సంఘంలోని దురాచారాలను నివారించుటకు ప్రయత్నించిన వారే కాని వీరెవరైనా దీనికి వ్యతిరేకంగా చెప్పారా? భర్తవద్దకు వెళ్ళి కాపురం చేయటం దురాచారం కాదు. ఆవిడకు తల్లి దండ్రులు వరుమానంగాగాని, Maintenance గా గాని, ఆవిడకు పుట్టే పిల్లలకుగాని, నగదు రూపముగానో, భూమి రూపముగానో యివ్వడం దురాచారం ఎట్లా అవుతుంది? బిడ్డలందరూ సమానంగా పుట్టారు, సమానంగా తినాలనే విషయం గుర్తించండి. వరకట్నాలు అడుగుతున్నారని, అందువల్ల పెళ్ళిళ్ళు కావడం కష్టంగా ఉన్నదని అంటున్నారు. ఎవరి స్టేటసు కొలదీ వారు చేసుకొంటున్నారు, వారివారి తాహతు, తరహా కులము బట్టి చేసుకొంటారు I.C.S. అయి యుండి 1,500 రూ. లు సంపాయించేవారు కావాలంటే, మూడువేలు తెచ్చుకునే హైకోర్టు జడ్జీకావాలంటే వరకట్నము అడుగుతారు, లేకపోతే ఏమి ఆస్తి ఉన్నదని అడుగుతారు. త్యాగం త్యాగం అంటే ఏమీ లేనివాడిని పెళ్ళి చేసుకుంటుందా, M.A. చదివిన ఆవిడ? లక్ష రూపాయల ఆస్తి ఉన్నవాడు కావలెనని అడుగుతారు. ఇది కేవలం స్త్రీల మీదనే ఉన్నది. అమ్మాయికి పది సంవత్సరముల వయస్సు వచ్చినప్పటి నుంచి పెండ్లి చేయాలని, భూమి అమ్మి అయినా పదివేలు కట్నం యిచ్చి చేయకపోతే తమ పిల్ల పెద్దయింట్లో పడదని, స్త్రీలు కోరుతూ ఉంటారు. ఇది నిజము అవునో కాదో గుండెమీద చేయివేసుకు చెప్పమని అడుగుతున్నాను—యిక్కడ స్త్రీ సభ్యురాండ్రు చాలామంది ఉన్నారు. భర్తలు రోజూ రాత్రిళ్ళు అన్నం తినేటప్పుడో, ఆఫీసుకు వెళ్ళేటప్పుడో, స్త్రీలు అడుగుతున్నారా లేదా? బాధిస్తున్నారా లేదా? ఈ సాంఘిక విషయాలన్నింటిని ఆర్థికంగా మారుస్తున్నారు. నరసింహారావుగారు భూ సంస్కరణలు తెచ్చి అంతా మార్చేస్తామంటున్నారు. భూ సంస్కరణలు తెచ్చి, అంతా ఆర్థికంగా మారిపోతే యివి మారిపోతాయి, డబ్బున్నవారు, మంత్రిగారు, విమానం ఎక్కుతారు, నేను కారు ఎక్కుతాను, రాఘవులుగారు రిక్షా ఎక్కుతారు. ఎవరి శక్తిని బట్టి వారు ప్రయాణం చేస్తూ ఉంటారు. అలాగే పెద్దవాళ్ళు పెద్దకట్నాలు, చిన్నవాళ్ళు చిన్నకట్నాలు యిచ్చుకుంటారు. దీనికి సంఘంలో మనం ఒక రూలు పెట్టితే ఎవరిని శిక్షించగలరు? దీనిని సుందరరామరెడ్డిగారు జిల్లా జడ్జీకి వేయమన్నారు, హైకోర్టు జడ్జీకే వేయవచ్చును. అసలు కేసు ఏది? ఎవరి కూతురికి వాళ్ళు యిచ్చుకొనకూడదా? ఇట్లాగయితే భార్యకు తిండి పెట్టకూడదు, వరుమానం యివ్వకూడదు అంటాము. ఈ ఆచారాన్ని కొంతమంది సహగమనంలో పోల్చారు. సహగమనమంటే మనిషిని చంపటం.

శ్రీమతి లక్ష్మీకాంతమ్మ :—ఇది ఆత్మను చంపటం.

శ్రీ ఎ. బాపినీడు :—స్త్రీని సమానంగా చూడటం లేదని దాసుగారు ఉద్ఘాటించారు. M.A. చదివినవారు కట్నము అడుగుతున్నారని అన్నారు. ఎవరు అడిగారు? ఎవరు నిర్బంధం చేశారు? సాధ్యమైన చోటనే చేసుకోమనండి. "నీవు నా కూతురుకు కట్నము అడిగావు కాబట్టి, నీమీద రిపోర్టుచేసి తొమ్మిదీ మాసాలు శిక్ష వేయిస్తాను" అంటే, యిది జరిగేదేనా? అవతల వానికి లక్షరూపాయల ఆదాయం ఉన్నది కాబట్టి 50 వేలు కట్నము

యిస్తామంటున్నారు. మన సంఘ ఆచారం ప్రకారం ఆడపిల్లకు పెళ్ళిచేసి, ఒక కుటుంబికు రాలిని చేసి, ఆ పిల్ల వృద్ధిలోకి రావాలని కోర్తారు. మన సంఘం యొక్క అలవాటు యిది.

*Mr. Deputy Speaker:* Further discussion on this Bill is adjourned to the next Non-Official day. Now, the House adjourns to meet again on Monday, the 4th November 1957 at 8-30 a.m.

*The House then adjourned till Half Past Eight of the Clock on Monday, the 4th November, 1957.*